# ప్రజలు - కళలు

## (ప్రత్యామ్నాయ ప్రజాకళాతత్వ వ్యాస సంకలనం)

సంకలనం & సంపాదకత్వం

**గౌరవ్**

ప్రచురణ

**అకాడెమి ఫర్ ఆల్టర్నేటివ్ ఆర్ట్స్ & ఈస్థటిక్స్**

ఆంధ్రప్రదేశ్ – తెలంగాణ

# ప్రజలు-కళలు

(ప్రత్యామ్నాయ ప్రజా కళాతత్వ వ్యాస సంకలనం)

సంకలనం & సంపాదకత్వం

గౌరవ్

ప్రచురణ

అకాడెమి ఫర్ ఆల్టర్నేటివ్ ఆర్ట్స్ & ఈస్థటిక్స్

ముద్రణ

2020



విజ్ఞప్తి

ఇందులోని వ్యాసకర్తల అభిప్రాయాలన్నింటితోనూ
సంపాదకుడు విధిగా అంగీకరించవలసిన అవసరం లేదు.

ప్రతిపాదిత చందా

80/- రూపాయలు

ప్రతులకు

9032094492

వివరాలకు

gourevmeka@gmail.com

# విషయసూచిక

"It is not enough for intellectuals to take a principled stand today, either for the sake of the principle or for themselves; they must take a principled stand for the sake of the whole progressive movement, every part of it, every area of it. They must understand that everyblow directed against the working class, the trade unions, the Negro people, the Jewish people - that every single act of oppression is an act against their own people – that every single act of oppression is an act against their own personal freedom and their own civil rights ......

If we act, if we join with the progressive movement, if we oppose every infringement on our civil rights, if we fight on each issue, each injustice if we build, along with the wokrers, a mighty peace movement, there is life and hope and the righ joy of unfettered creation; if we fail to act, there is only the road to hell that Germany, Italy and Japan once travelled."

– HOWARD FAST
Intellectuals in the Fight for Peace
Masses of Mainstream Inc,
New Year, June 1949

## అంకితం

అజరామర ప్రత్యామ్నాయ ప్రజా కళా సృజనలో అసమానతలు, ఆధిపత్యాలకు వ్యతిరేకంగా అణగారిన ప్రజల పక్షాన నిలిచిన అసంఖ్యాక కళాకారులందరికీ అభివాదాలతో....

# భూమిక

ఉత్తరప్రదేశ్‌లోని దేవరియా జిల్లాలో పండిత్ కేముడెరా గ్రామంలో భూస్వామ్య పెత్తందారీ కుటుంబంలో పుట్టి ఢిల్లీలో జెఎన్‌యులో చదివి దేశంలోని కులాధిపత్యాన్ని, మతోన్మాదాన్ని, సామ్రాజ్యవాదాన్ని లోతుగా అధ్యయనం చేసి సాంస్కృతికోద్యమం లక్ష్యంగా **'జన సాంస్కృతిక మంచ్'** స్థాపించి జీవితాంతం ఆధిపత్య వర్గాల వెన్నులో తన కలంతో చలి పుట్టించిన నిజమైన ప్రజాకవి గోరఖ్‌పాండే జనవరి 28, 1989 న ఆత్మహత్య చేసుకున్నాడు.

కేరళలోని మలప్పురం జిల్లాలో కుట్టిపురం గ్రామంలో పుట్టి శాంతినికేతన్ మొదలుకుని గోవా వరకూ కళాత్మక చైతన్యం కోసం పరిభ్రమిస్తూ, ఆ క్రమంలో గుజరాత్‌లోని బరోడాలో సహ విద్యార్థులతో కలిసి **'ది రాడికల్ పెయింటర్స్ & స్కల్ప్చర్స్ అసోసియేషన్'** స్థాపించి కొద్దిమందికే పరిమితమనుకునే కళని భూమార్గం పట్టించి కళ ప్రయోజనం ప్రజాసంక్షేమమేనని జీవితం మొత్తం అణగారిన వర్గాల కళాభావనకే అంకితమైన నిఖార్సైన ప్రజా కళాకారుడు కె.పి. కృష్ణకుమార్ డిసెంబర్ 26, 1989న ఆత్మహత్య చేసుకున్నాడు.

దళిత వామపక్ష శక్తుల ఐక్యత కోసం జీవితాంతం తపించి ముంబాయిలోని రమాబాయి నగర్ దళిత కాలనీలో అంబేద్కర్ విగ్రహానికి చెప్పులు దండ వేయడం సహించలేక నిరసన తెలుపగా జరిగిన పోలీసు కాల్పుల్లో 10 మంది హత్య కావించబడ్డారు. ఈ పరిణామాల్ని జీర్ణించుకోలేక సాంస్కృతిక కళాకారుడు 'విలాస్ గోరే' తన పూరింటి గోడమీద **'అంబేద్కర్ వాదులంతా ఐక్యమవ్వాల'**ని రాసి 1997, జూలై 15న ఆత్మహత్య చేసుకున్నాడు.

రెండు దశాబ్దాల అనంతరం ఎన్నో ఆశలతో చదూకుందామని హైద్రాబాద్ సెంట్రల్ యూనివర్శిటీలో చేరిన రోహిత్ వేముల కూడా ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ మధ్యలో నైరాశ్యం ఆవహించి తనువు చాలించిన స్వాప్నికులు ఎందరో.

సరళీకరణ ఆర్థిక విధానాల కారణంగా మనిషే సరుకుగా ఐపోయిన క్రమం అప్పటికి కుదురుకుంది. ఆత్మహత్యలు చేసుకునేలా ప్రేరేపించడంతోబాటు స్వయంగా

హత్యలు చేయడం మొదలుపెట్టింది. పశ్చిమబెంగాల్‌లోని జల్పాయిగురిలో పుట్టి చత్తీస్‌ఘర్ ప్రజాపోరాటాల నాయకుడిగా ఎదిగిన శంకర్‌గుహనియోగిని 1991, సెప్టెంబర్ 28న మెషీన్‌గన్‌లతో చంపితే, బీహార్‌లో సివాన్‌లో పుట్టి వెనుదీయని విద్యార్థి నాయకుడిగా ఎదిగిన చంద్రశేఖర్ ప్రసాద్‌ని 1997, మార్చి 31న హత్య చేయడం జరిగింది.

16 సం॥రాలు గడిచాయి. ఈసారి మతోన్మాదం కొద్దిపాటి బెరుకు కూడా లేకుండా నిస్సిగ్గుగా 2013లో నరేంద్ర దభోల్కర్‌తో మొదలెట్టి వరుసగా గోవింద పన్సారే, ఎం.ఎం. కల్బుర్గి, గౌరీ లంకేష్‌ల వరకూ అతి దారుణంగా హత్య చేసింది.

సఫ్దార్ హష్మి నుండి మెహమ్మద్ అఖ్లక్ దాకా ఎన్ని రంగులు మార్చినా ఆధిపత్యానిది ఎప్పుడూ నియంత స్వభావమే. కులం, మతం, ప్రాంతం, వర్గం, లింగం. ఈ దేశంలో అసమానతా రూపాలైన ప్రతి ఆధిక్యతా రూపాన్ని సారంతో సహా పెకలించి వేయడం భావోద్యమాల కర్తవ్యం. అలాంటి అణగారిన ప్రజా ఉద్యమాల పక్షం వహించడం ప్రత్యామ్నాయ సాంస్కృతికోద్యమాల లక్ష్యం. అందులో భాగమే కళని ప్రజాతంత్ర యాత్రలో భాగం చేయడం. అందుకే కళ పోషించే నిర్మాణాత్మక పాత్ర గురించి ఇలాంటి చర్చకు తెరతీయడం.

స్థబ్దత రాజమేలుతున్నచోట శబ్దం చేయడం కళాకారుల కర్తవ్యం. చరిత్ర అలాంటి ప్రజా కళాకారులకే సముచిత స్థానం ఇచ్చింది. తన పాట కారణంగా పాలకుల చేతుల్లో క్రూరమైన చిత్రహింసలకు గురై 40 ఏళ్ళకే అమానవీయంగా హత్య కావించబడ్డ చిలీ దేశపు కవి, రచయిత, గాయకుడు, సంగీతకారుడు, రంగస్థల ప్రయోక్త, ప్రజా కళాకారుడు, కమ్యూనిస్టు కార్యకర్త 'విక్తర్ జారా' సమాధి చిలీ రాజధాని నగరం శాంటియాగోలో ఉంది. దానిమీద రెండే పదాలుంటాయి.

**"Until Victory..."**

**"విజయం సాధించే వరకు..."**

* * *

# సంపాదకుడి మాట

> "... The first requisite to a normal healthy existence is that art shall continually evolve together with life itself.
>
> I do not know whether the society of today will create its own art, but i am sure that if it fails to do so, we shall have no living art, only a museum, a mansoleum wherein sleep the embalmed mummics of the past...."

– Romain Rolland
The People Theater

వంద సం॥రాల క్రితం రోమరోలా కళని ఎప్పటికప్పుడు సజీవంగా సృజించుకోవలసిన అవసరాన్ని నొక్కి చెపుతూ "ప్రజల రంగస్థలం" అనే గ్రంధానికి ముందుమాటలో రాసిన వాక్యాలివి. కళ జీవనది. కొత్తదనాన్ని సంతరించుకోవాలే కానీ పాతమూసలో పడి ఉండరాదు.

ఫ్రెంచ్‌లో ఈ చర్చ జరుగుతున్న కాలంలోనే రష్యాలోని పరిణామాలు కొత్తమలుపు తిరిగాయి. అణగారిన ప్రజల చైతన్యం కోసం కొన్ని నూతన ప్రయత్నాలు జరిగాయి. ఆ సందర్భంగా కళని గురించి కూడా అనేక సంవాదాలు తెరమీదికొచ్చాయి. ప్లెఖ్‌నోవ్ వంటి మేధావులు "కళ–సాంఘిక జీవనం" (Art And Social Life) పేరిట గ్రంథస్థం చేసారు.

Herbert Read వంటి వారు కళని జీవితంలోని పాశ్వాలన్నింటికీ అన్వయించడానికి ప్రయత్నిస్తే భారతదేశంలో పూర్వం నుంచి చర్చోపచర్చలు జరుగుతూనే ఉన్నాయి. అలంకార శాస్త్ర అధ్యయనాలు అనేకం ఉన్నాయి.

కళాతత్వజ్ఞుడు ఆనంద కుమారస్వామి స్నేహితుడిగా స్వాతంత్ర్య సమరయోధుడిగా దుగ్గిరాల గోపాలకృష్ణయ్య వంటివారు నందికేశవుడి 'అభినయ దర్పణాన్ని' ఆంగ్లంలోకి అనువదించగా, సంజీవ్‌దేవ్ వంటివారు, దామెర్ల రామారావు వంటివారు కళని జనజీవితాలతో మిళితం చేసేందుకు కృషి చేసారు.

ఒకవైపు మార్క్సిస్టు అవగాహనతో కళని ప్రజా ఉద్యమాలకి దన్నుగా మల్చుకునే క్రమం సఫ్దార్ హష్మి వంటివారు చేస్తే సోషలిస్టు అవగాహనతో కె.వి. సుబ్బన్న లాంటి వాళ్ళు 'నీనాసం' మొదలగు సంస్థల నిర్మాణానికి కృషి చేసారు.

కళ కోసమే స్థాపించబడిన వామపక్ష సాంస్కృతిక సంఘాలు ఒకవైపు, కళ వ్యవస్థీకృత మయినదంటూ కళ ప్రయోజనాన్ని త్యజించే హేతువాదం, రాయిస్టు, హ్యూమనిస్టు ధోరణులు మరోవైపు తెలుగులో కొద్దికాలం ఆసక్తికరమైన చర్చ చేసాయి.

రావిపూడి వెంకటాద్రిగారి "కళ–శాస్త్రం–తత్వం–హేతువాదం" కళల మీద కొంత సంచలనం కలిగించడం జరిగింది. సంజీవ్‌దేవ్‌గారితో ఆ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా జరిగాయి. తర్వాత కూడా అడపాదడపా తెలుగులో కళ గురించిన చర్చ జరిగిందే కానీ ప్రత్యామ్నాయ కళలపై జరగలేదు.

ఈ వ్యాస సంకలనం కోసం సంప్రదించిన వారిలో సైతం ఎక్కువమందికి ప్రజా, ప్రత్యామ్నాయ కళలపై అవగాహన లేదు. మామూలుగానే ప్రత్యామ్నాయ కళలకి సంబంధించిన చర్చ అరుదుకాగా తెలుగులో ఎక్కడో కాని అది జరగాల్సినంత జగలేదని చెప్పవచ్చు.

అందులో భాగంగా ఈసరికే ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం తరఫునుండి కొన్ని ప్రయత్నాలు అనేక పరిమితుల్లో చేస్తున్నాం. ఆ అధ్యయనం అన్వేషణ, ఆచరణలో భాగంగా తీసుకొస్తున్నవే ఈ ప్రచురణలు. ఇప్పటి దాకా వాటిలో ప్రధానంగా,

ప్రత్యామ్నాయ సాంస్కృతిక వికాసోద్యమంలో భాగంగా ఇప్పటి వరకు **సంస్కృతి (సంక్షోభాలు – సంవాదాలు)**, **ప్రత్యామ్నాయ సినిమాలు (దృక్పథాలు – దృక్కోణాలు)**, **మద్యపానమా? మానవత్వమా (మద్యం సమస్యపై మహిళల వ్యాసాలు)**, **మానవీయ ఆసరా స్వరం (మద్య వ్యతిరేక వ్యాస సంకలనం)**, **భారతదేశ ప్రజలమైన మేము.... (70 సం॥రాల రాజ్యాంగ విశ్లేషణా వ్యాస సంకలనం)**, **చదువు అంటే ఏంటి? చదువెందుకు? (విద్య గురించిన విభిన్న వ్యాసాలు)** ప్రచురించడం జరిగింది.

నేననుకున్న భావాల్ని, నా అభిప్రాయాల్ని రాసి ప్రచురించే కంటే భిన్న కోణాల్లో నిర్దిష్ట అంశాల్ని అనేకమంది వ్యాసాలుగా సేకరించి ప్రచురించడం ద్వారా ఆరోగ్యకరమయిన వైవిధ్యభరిత ప్రజాతంత్ర సంవాదానికి స్థానం కల్పించగలమేమో అనే భావనే ఈ సంకలనాల ప్రచురణకి ప్రధాన కారణం. ఒక్కడిగా నా భావాల్ని ప్రచారం చేయడం కంటే నా భావజాలంతో సారూప్యం గల సమాలోచనల్నిలా సేకరించి వెలువరించడం సమిష్టితత్వాన్ని గౌరవించడానికే.

అభిమానంతో పాటు దురభిమానాన్ని ప్రేమతో పాటు ద్వేషాన్ని మిత్రులతో బాటు శత్రువుల్ని కూడా మూటకట్టుకుని ముందుకు సాగడం ఇన్నేళ్ళలో అలవాటైపోయింది. ఆ క్రమంలో ప్రత్నామ్నాయ కళలకి సంబంధించిన చిరుయత్నం యిది.

జనజీవితాన్ని అతలాకుతలం చేసిన కోవిడ్-19 ప్రభావానికి ఎవరూ అతీతులు కారు. కాన ఈ ప్రాజెక్ట్ అనుకున్నదానికంటే బాగా ఆలస్యం అయింది. అయినా సంతృప్తికరంగా రాలేదు. వ్యాసాలిస్తామని ఏకంగా నెలలకి నెలలు కాలయాపన చేసినవారి విజ్ఞత కూడా ఇందుకు కారణం. అందుకే ప్రస్తుతానికి ఈ వ్యాసాల్ని మాత్రమే తీసుకొస్తున్నాను. దీనికి కొనసాగింపుగా మరో ప్రయత్నం చేసే తలంపు ఉన్నది.

అణగారిన ప్రజల ప్రత్యామ్నాయ కళ గురించి, అలంకార శాస్త్రం గురించిన అధ్యయనాలు విస్తృతంగా జరగాల్సిన తరుణం ఇది. దళిత బహుజన కళా తాత్వికతపై పరిశోధించాల్సిన సమయం ఇది.

ఆ క్రమంలో తడబడుతూ వేసిన చిన్న తప్పటడుగిదని నా అభిప్రాయం. ఇంకా సూటిగా, స్పష్టంగా, సమగ్రంగా వేయాల్సిన అడుగులెన్నో భవిష్యత్తుకి యువతరం బాకీ ఉంది. అసమానతలపై రోకలిపోటు వంటి ఆ ప్రయత్నాల్ని ఎప్పుడూ హర్షించే, ఆహ్వానించే, అందుకోసం తపించే వేళ,

కళ ఒక అజరామర హేల!

* * *

# 1. ప్రజా కళ – ప్రత్యామ్నాయ కళ

- ఎన్. వేణుగోపాల్, సంపాదకులు, వీక్షణం, హైదరాబాద్

ప్రజా కళ గురించి తెలుగు సమాజంలో, సాహిత్యంలో ఎన్నో దశాబ్దాలుగా చర్చ జరుగుతున్నది. ఇక్కడ కళ అనే స్థూలమైన మాటలో కళలు, సాహిత్యం, సంస్కృతి, చరిత్ర, భాష, పరిశోధన, సంవిధానం అనే అన్ని అంశాలనూ కలిపి వాడుతున్నాను. ఎన్ని దశాబ్దాలుగా చర్చ జరిగినా, ఆ మాట మనకు ఎంత తెలిసి ఉన్నా, తెలిసినదే అనుకుని మనం నిత్యం వాడుతున్నదే అయినా కొన్ని మాటలను తరచి చూస్తే అన్వేషించవలసిందీ, తెలుసుకోవలసిందీ ఇంకా ఎంతో ఉన్నదని అనిపిస్తుంది. ఇటువంటి అంశాలలో నిశ్చల నిశ్చితాలకు, ఇక ఇదే సమగ్ర సార్వకాలిక నిర్వచనం అని నిర్ధారించడానికి అవకాశం లేదు. ప్రతి తరమూ తన ముందరి తరాల అనుభవ, ఆలోచనా, వివేచనా జ్ఞానం మీద ఆధారపడుతూనే, తనకై తాను కొత్త ప్రశ్నలు వేసుకుంటుంది. కొత్త అన్వేషణలు చేస్తుంది. కొత్త నిర్ధారణలు చేయడానికి సాహసిస్తుంది. మానవ సమాజ పురోగమనానికి ఇదే కారణమూ, అనివార్యమూ, పర్యవసానమూ కూడ.

ప్రజాకళ, ప్రజా సాహిత్యం అనే మాటలు బహుశా తెలుగు సామాజిక ప్రపంచంలోకి ప్రవేశించి అటూ ఇటూగా వంద సంవత్సరాలు అయి ఉంటుంది. ఒక ఆశ్చర్యకరమైన విషయమేమంటే తెలుగు సమాజంలో, అటు బ్రిటీష్ పాలనలో ఉండిన కోస్తా, రాయలసీమలోనైనా, ఇటు నిజాం పాలనలో ఉండిన తెలంగాణాలోనైనా, ప్రజా రాజకీయా ఆలోచనలు ప్రారంభం కావడానికి చాల ముందుగానే ప్రజా సాహిత్య, ప్రజా కళా ఆలోచనలు ప్రారంభమయ్యాయి. బ్రిటిష్ భారత దేశంలో వలస వ్యతిరేక జాతీయోద్యమంలో భాగంగా ప్రజా రాజకీయాలు, విస్తృత ప్రజా భాగస్వామ్యం అనే ఆలోచనలు 1920 లలో ప్రారంభమైతే, నిజాం హైదరాబాదులో 1930ల చివర ప్రజా రాజకీయాలు ప్రారంభమయ్యాయి. కాని ఈ రెండు ప్రాంతాలలోను ప్రజా సాహిత్య, ప్రజా కళా భావనలు అంతకు ఒకటి రెండు దశాబ్దాల ముందే ప్రవేశించాయి. **'నాది ప్రజల ఉద్యమము'** అని చెప్పుకున్న గురజాడ అప్పారావు బహుశా ఆ మాటను చైతన్యయుతంగా మాట్లాడిన తొలి సాహిత్యకారులలో ఒకరు కావచ్చు. (ఒంగోలు ముని సుబ్రమణ్యంకు 1911 ఏప్రిల్ 3న రాసిన ఉత్తరంలోని ఈ వాక్యం సుప్రసిద్ధం). అప్పటికి నాలుగైదు దశాబ్దాలుగా

మద్రాసు రాష్ట్రంలోని తెలుగు సామాజిక, రాజకీయార్థిక జీవనంలో వస్తున్న మార్పులు, సాహిత్యాన్ని సంఘ సంస్కరణ కోసం ఉపయోగించాలనే ప్రయత్నాలు ఇలా సాహిత్యకారులొకరు స్పష్టంగా, నిర్ద్వంద్వంగా సాహిత్యాన్ని "ప్రజల ఉద్యమం" అని చెప్పడానికి భూమిక కల్పించి ఉంటాయి. అలాగే హైదరాబాదు రాజ్యంలో 1921 లో ఏర్పాటయిన ఆంధ్ర జన సంఘం లక్ష్యాలలో ఒకటిగా చెప్పుకున్న ప్రజలలో విజ్ఞాన వ్యాప్తి కొద్ది కాలంలోనే ప్రజా కళ ఆవిర్భావానికి, వ్యాప్తికి అవకాశాలను పెంచింది.

అలా గత శతాబ్ది తొలి దశకాలలో తెలుగు సామాజిక, సాహిత్య రంగాలలో ప్రవేశించిన 'ప్రజా' ఆలోచన ఈ వంద సంవత్సరాలలో ఎంతో ముందుకు సాగింది. అనేక విజయాలు సాధించింది, మలుపులు తిరిగింది, సవాళ్లను ఎదుర్కొన్నది. వెనుకపట్టు పట్టింది, మళ్లీ ముందుకు కదిలింది, పరిమాణాత్మక మార్పులనూ గుణాత్మక మార్పులనూ కూడ నమోదు చేసింది. తెలుగు సీమలో ప్రజా కళ భావన చరిత్ర అద్భుతమైనది, విస్తారమైన పరిశోధన అవసరమైనది, దానికదిగానే ఒక ఉద్గ్రంథం కాగలిగినది. ఈ చిన్న వ్యాసంలో అంత అవకాశం లేదు గాని, స్థూల పరిణామాలను మాత్రం గుర్తించడానికి పరిమితమవుతాను.

తెలుగు సాహిత్య కళా, సాంస్కృతిక, మేధో రంగాలలో ప్రజా కళ భావనకు ఇంత ఘనమైన చరిత్ర ఉన్నప్పటికీ, అసలు ప్రజా కళ అంటే ఏమిటనే నిర్వచనంలోనే రావలసినంత స్పష్టత రాలేదనిపిస్తుంది. "జానపద కళ" అనే పేరు కింద ఉన్నదంతా ప్రజా కళే అనుకునేవాళ్లున్నారు. ప్రజలలో ఉన్న కళను ప్రజా కళ అనాలా, ప్రజల కోసం వెలువడే కళను ప్రజా కళ అనాలా అనే స్పష్టత లేని వాళ్లున్నారు. "ప్రజా కళ" అనే పదబంధంలో మొదటి మాట రూపానికి సంబంధించినదా, సారానికి సంబంధించినదా అనే విచికిత్సలో ఉన్నవాళ్లున్నారు. అది వస్తు నిర్దిష్టమా, శిల్ప నిర్దిష్టమా గందరగోళం ఉన్నవాళ్లున్నారు. ప్రజా రాజకీయాలు, ప్రత్యామ్నాయ రాజకీయాలు ఉనికిలోకి వచ్చిన తర్వాత ఆ రాజకీయాలకు అనుబంధంగా ఉ ండడమే ప్రజా కళ అనుకునే వాళ్లున్నారు. పాలకవర్గ కళ, ప్రజా కళ అనే విభజన రేఖను గుర్తించేవాళ్లూ గుర్తించని వాళ్లూ కూడ ఉన్నారు. 'ప్రజా కళ' అనే మాట ఒకానొక దృక్పథానికి సంబంధించినదనీ, అది కేవలం రెండు పదాల కూర్పు కాదనీ గుర్తించని వాళ్లున్నారు. అంటే మొత్తం మీద వంద సంవత్సరాల చరిత్ర తర్వాత కూడ, "ప్రజా కళ" లో అనేక ప్రయోగాలు, ప్రయత్నాలు జయాపజయాలు సాధించిన తర్వాత కూడ మనకు 'ప్రజా కళ' అనే మాట పట్లనే స్పష్టత ఏర్పడలేదు.

గురజాడ తనది ప్రజల ఉద్యమం అని రాసిన సందర్భం తక్షణ భాషా చర్చకు సంబంధించినదైనప్పటికీ, ఆయన ఇతర రచనలతో కలిపి చూసినప్పుడు అది దృక్పథానికి సంబంధించినది కూడానని తేటతెల్లమవుతుంది. అప్పటిదాకా సాహిత్యం జీవితంతో సంబంధం లేకుండా ఉన్నదని, అనంతమైన వైవిధ్యంతో కూడిన జీవితమే సాహిత్యానికి భూమిక కావాలనీ ఆయన కన్యాశుల్కం రెండో కూర్పు ముందుమాటలో రాసిన మాటలను బట్టి, జీవితమంటే ప్రజా జీవితం అని అర్థం చేసుకుంటే ప్రజా కళలో చిత్రణ పొందవలసినది ప్రజా జీవితమని అర్థమవుతుంది. అయితే ఇప్పుడు వెనక్కి తిరిగి చూస్తే ఆ మాటకు ఆనాటి స్థల, కాల, ఆలోచనా పరిమితులున్నాయని అంగీకరించవచ్చు.

అయితే విచిత్రంగా, ఆయన తర్వాతి రెండు దశాబ్దాల మేధో పరిణామం ఆ పరిమితులను గుర్తించి, సరిదిద్ది పురోగమించే బదులు ఆ స్థాయికి కూడ చేరకుండానే ఆగిపోయింది. నవ్య కవిత్వం, భావ కవిత్వం పేరుతో సాగిన ఆ మేధో ధార ప్రజా కళగా మారడంలో మరొక అడుగుముందుకు వేయకుండానే ఆగిపోయింది. కళను పాత ఆస్థాన సంప్రదాయం నుంచి ప్రజల దగ్గరికి తెచ్చే క్రమంలో గురజాడ చూపిన బాటను విశాలం చేయడానికి బదులు, కేవలం విద్యావంతులైన మధ్యతరగతి శిష్ట వర్గాల దగ్గర ఆపివేసింది. ఆ వర్గ జీవితాన్ని కూడ సామూహికంగా, విస్తృతంగా చిత్రించడం కాకుండా ఒంటరి శోకాన్ని, ఏకాకి అనుభూతులను ప్రధానం చేసింది. అలా 1910 ల్లోనే నాటిన 'ప్రజా కళ' ఆలోచనా విత్తనం 1930 ల మధ్య దాకా మొలకెత్తకుండానే ఉండిపోయింది.

అంతర్జాతీయంగా మహా ఆర్థిక సంక్షోభం, రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలపు ఆకటి దశాబ్దం, మరొకవైపు సోవియట్ యూనియన్ ప్రజా రాజకీయార్థిక వ్యవస్థ, ప్రజా కళా సాంస్కృతిక వ్యవస్థ విజయాలు, దేశంలో వలసవాద వ్యతిరేక ప్రజా ఉద్యమపు విస్తరణ, తెలుగు సీమలో జమీందారీ వ్యతిరేక రైతాంగ పోరాటాలు వంటి అనేక పరిణామాలు దేశంలోనూ, తెలుగు సీమలోనూ సాహిత్య కళారంగాలను కూడ ఒక కుదుపు కుదిపాయి. 1936లో అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం మొదటి మహాసభలో ప్రేమ్ చంద్ ఉపన్యాసం ఒక రకంగా దేశంలో ప్రజా కళ భావన వికాసంలో ఒక గుణాత్మకమైన గెంతు అని చెప్పాలి. ఆ ఒరవడిలోనే 1943లో అఖిల భారత స్థాయిలో కమ్యూనిస్టుల నాయకత్వంలో ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ (ఇప్టా) ఏర్పడి, పేరులోనే "ప్రజా" అనే మాట చేర్చుకుంది.

ఆ భావనలు యుగస్వభావంగా మారాయి గనుక తెలుగు సాహిత్య కళా రంగాలకు కూడ వ్యాపించి, ప్రజా కళా సాహిత్యాలు వెల్లువెత్తాయి. ఇప్టాలో భాగంగా, తెలుగు నాట కూడ ప్రజా నాట్య మండలి, అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడ్డాయి. కళ ప్రజల కోసమే అనే నినాదం ప్రారంభమయింది.

అయితే ఈ ప్రజల కోసమే కళ అనే నినాదాన్ని కూడ నిశితంగా పరిశీలించవలసి ఉంది. కమ్యూనిస్టులు ప్రజా కళ అనడానికి ముందే ప్రజల్లో వారి నిత్య జీవితంలో భాగమైన కళ ఉంది. అది ప్రధానంగా మూడు రకాలు : వారే సృష్టించుకున్న అభివృద్ధి చేసుకున్న కళ మొదటిది. ప్రజల కోసం పాలకవర్గాలు తయారుచేసి, చేయించి, ప్రజల్లో ప్రవేశపెట్టిన కళ రెండవది. నేరుగా పాలకవర్గాలు తయారు చేయించకపోయినా, కళయే వృత్తిగా గల కులాలు, సమూహాలు, వ్యక్తులు తయారుచేసి, దేశవ్యాప్తంగా ప్రదర్శిస్తుండిన కళ మూడవది. ఈ మూడు రకాల "ప్రజా కళ"లో కూడ కలగాపులగంగా పాలకవర్గ భావజాలం ఉంది. అప్పటికే సమాజంలో పరిచితమైన, ప్రాచుర్యంలో ఉన్న ఈ మూడు రకాల కళలూ ప్రజల ప్రయోజనం అనేది గీటురాయిగా పరిశీలిస్తే ప్రజా కళ కాజాలవు. వీటన్నిటినీ ఇవాళ గ్రామీణ కళ అనీ, జానపద కళ అనీ, మౌఖిక కళ అనీ, ప్రజా కళ అనీ కూడ పిలుస్తున్నారు. మొదటి మూడు పేర్లూ ప్రాంతాన్ని బట్టీ, వ్యవహర్తలను బట్టీ, ప్రక్రియను బట్టీ వచ్చినవి గనుక తటస్థమైనవి గాని, ప్రజా కళ అన్నప్పుడు అది ఒక దృక్పథాన్ని సూచించే మాట గనుక దాన్ని జాగ్రత్తగా వాడవలసి ఉంటుంది.

వీటిలో మొదటిది సహజమైనది. ప్రజలు తమ శ్రమ మరిచిపోవడానికి, శ్రమ క్రమాన్ని వేగవంతం చేయడానికి, క్రమబద్ధం చేయడానికీ, తీరిక సమయాల్లో సామూహిక వినోదానికీ, విజ్ఞానానికీ, భవిష్యత్ తరాలకు తమ వివేకం అందించడానికీ, వ్యక్తిగత స్థాయిలోనూ, సామూహిక స్థాయిలోనూ ప్రకృతినీ, ప్రేమనూ ఎడబాటునూ, కష్టాన్నీ సుఖాన్నీ, విషాదాన్నీ, సంతోషాన్నీ, కోపాన్నీ, దైవ భావననూ వ్యక్తీకరించుకోవడానికి తయారు చేసుకున్నవి. అవి నూటికి నూరు పాళ్లు ప్రజలు తయారు చేసుకున్నవే. విభిన్న తరాల ప్రజలు మార్పులూ చేర్పులూ చేస్తూ పునరుత్పత్తి చేసినవే. ప్రజల్లో నుంచే కళాకారులు తలెత్తి ప్రచారం చేసినవే. వస్తువులో ఇవి నిసర్గ సౌందర్యాన్నీ అమాయకత్వాన్నీ ప్రతిఫలిస్తాయి. రూపంలో గొప్ప ఆకర్షణీయమైన సామూహిక కళగా ఉంటాయి.

ఈ నైసర్గిక, సహజ "ప్రజా కళ" కు ఉన్న విస్తృత జనాదరణనూ, విపరీతమైన పునరుత్పత్తి శక్తినీ గుర్తించిన పాలకవర్గాలు వీటిలో తమభావజాలాన్ని ప్రవేశపెట్టడం,

ఈ రూపాలలో తమ భావజాలంతో నిండిన కళను ఉత్పత్తి చేయడం ప్రారంభించాయి. అలా మొదటి రకం ప్రజా కళ అమాయకత్వాన్ని కొల్లగొట్టి రెండో రకం "ప్రజా కళా" రూపాలు రావడం మొదలైంది. రామాయణ, మహాభారత, భాగవత కథలకు, పురాణ కథలకు, హిందూ బ్రాహ్మణీయ భావజాలానికి ఈ "ప్రజా కళా" రూపాన్ని అద్ది చక్కెర పూతల విషగుళికలను ప్రజల మెదళ్లలోకి ఎక్కించడం ప్రారంభమయింది.

భారత సమాజంలోని దుర్మార్గమైన కుల వ్యవస్థ కళాకారులకు కూడ కులం అద్దింది. ప్రతి మానవ మేధా సృజనాత్మకమైనదే, కళ సృష్టించగలదే అయినా, భారత సమాజం కళను కొన్ని కులాల గుత్తాధిపత్యంగా మార్చివేసింది. పాలక, శిష్ట, విశ్రాంతి వర్గాల కోసం శాస్త్రీయ, ప్రామాణిక కళగా, పాలిత, ఉత్పత్తి కులాల, అశేష ప్రజానీకం కోసం జానపద, నిమ్నస్థాయి కళగా కళను విడదీసింది. అందులో భాగంగానే దాదాపు ప్రతి కులానికీ ఒక ఆశ్రిత కళాకారుల ఉపకులాన్ని తయారు చేసింది. దేశవ్యాప్తంగా విస్తారమైన జన బాహుళ్యానికి పంట కోతలు ముగిసిన కాలానికీ, తర్వాత వ్యవసాయ పనులు ప్రారంభమయ్యే కాలానికీ మధ్య కాలంలో ఈ కళా ప్రదర్శనలు ఇస్తూ సంచార సమూహాలుగా ఉండే కళాకారుల కులాలు, సమూహాలు, బృందాలు తయారయ్యాయి. ఈ కళాకారుల రూపం ప్రజలదే గాని, వస్తువును మాత్రం పాలకవర్గ భావజాలమే నిర్దేశించడం ప్రారంభమయింది.

ఈ మూడు రకాల కళలోనూ, వ్యవహర్తలు, భాగస్వాములు, శ్రోతలు, ప్రేక్షకులు అందరూ ప్రజలే, ఉత్పత్తి కార్యకలాపాలలో పాల్గొంటున్నవారే అయినప్పటికీ, వారి కళారూపాల వస్తువు మాత్రం ప్రజా ప్రయోజనాలకు అనుగుణమైనది కాదు. వ్యతిరేకమైనది కూడ. అది స్థూలంగా వర్ణాశ్రమ ధర్మాన్ని, కర్మ సిద్ధాంతాన్ని, అసమానతను, దోపిడీని సమర్థించే, బలపరిచే, ప్రచారం చేసే కళ. ప్రజలను నిష్క్రియాపరులను చేసే కళ. కాకపోతే, ఈ కళా నిర్వాహకులు ప్రజలు గనుక, వారు నిరంతరం దోపిడీ పీడనలను అనుభవిస్తున్నారు గనుక, ఆ పీడకుల మీద వారి ఆగ్రహమో, ఆక్రోశమో, ఫిర్యాదో ఉంది గనుక వారు తమ కళలో దాన్ని కూడ ప్రవేశపెట్టారు. అది వ్యంగ్యం రూపంలో, నర్మగర్భమైన సంభాషణల రూపంలో, చిత్రపటాల రూపంలో, తమకు తాము లేని ఆభిజాత్యాన్ని ఆరోపించుకునే రూపంలో, తమ ప్రత్యర్థుల పట్ల వెటకారం రూపంలో, అనేకానేక రూపాలలో మన సాంప్రదాయిక "ప్రజా కళ" లన్నిటిలోను నిక్షిప్తమయింది. అయితే ఈ నిరసన, వ్యతిరేకత అందులో ప్రధానాంశం కాదు. అందులో ప్రధానాంశం వ్యవస్థా సమర్థన, యథాస్థితి సమర్థన మాత్రమే.

ఈ సంక్లిష్టమైన వాతావరణంలో కమ్యూనిస్టులు ప్రవేశించారు. తమ భావాల ప్రచారం కోసం, తమ భావజాల వ్యాప్తికోసం ఈ కళారూపాలను చేపట్టడం అత్యవసరం. అన్ని భావజాలాలూ ఆ పని చేయవలసిందే. కాని ఉన్నది ఉన్నట్టుగా ఆ "ప్రజా కళా" రూపాలను గ్రహించడానికి, వినియోగించడానికి అవకాశం లేదు. అవే వినియోగిస్తే, పాలకవర్గ భావజాలమే పునరుత్పత్తి అవుతుంది. 1940 ల్లో మొదటిసారి ఈ పని ప్రారంభించిన కళాకారులు గాని, కళా సిద్ధాంతవేత్తలు గాని ఈ సమస్యను సైద్ధాంతిక స్థాయిలో ఆలోచించారో లేదో తెలియదు. వారిలో ఏ ఒక్కరూ ఈ సైద్ధాంతిక సమస్యను ప్రస్తావించలేదు. కాని ఆచరణలో మాత్రం చాలా ప్రయోగాలు చేశారు.

ఆ ప్రయోగాల నుంచి మనం ఇప్పుడు గ్రహించగలదేమంటే, ఇంగ్లిష్ సామెత చెప్పినట్టు 'స్నానం చేయించిన మురికినీటితో పాటు బిడ్డను కూడ పారవేయడం తగదు' అని ఆ తొలితరం కళాకారులు గుర్తించారు. వస్తువులో సమస్యలు ఉన్నాయని అప్పటివరకూ ఉన్న "ప్రజా కళా" రూపాలను మొత్తంగా తిరస్కరించలేము. రూపం జనాకర్షకంగా ఉన్నదని ఆ "ప్రజా కళా" రూపాలను మొత్తానికి మొత్తంగా యథాతథంగా స్వీకరించలేము. ఇలా పూర్తిగా తిరస్కరించడానికీ, పూర్తిగా స్వీకరించడానికీ వీలులేని ఒక సంక్లిష్ట స్థితిలో దృక్పథం ప్రధానమైన, ప్రజా ప్రయోజనాలు ప్రధానమైన, ప్రజలను ఆకర్షించగలిగే "ప్రజా కళ" భావన రూపు దిద్దుకుంది. దాదాపుగా అన్ని కళారూపాలలో జనాకర్షకమైన ప్రజా కళారూపాలను తీసుకోవడం, ఆ రూపాలలో ప్రజా ప్రయోజనకరమైన సారాన్ని వస్తువును నింపడం అనే పని తెలుగులో 1940ల తొలి తరం కళాకారులు చేశారు, ప్రజా ఉద్యమ నాయకులు మార్గ నిర్దేశనం చేశారు.

ఈ ప్రయోగం 1943లో ఆంధ్ర ప్రజా నాట్యమండలి ప్రారంభంతో మొదలై, 1946-51 తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట కాలంలో విస్తరించింది. అపూర్వమైన విజయాలు సాధించింది. ఆ ఆచరణ అలాగే సాగి ఉంటే బహుశా గొప్ప కళా సిద్ధాంతాలు వెలువడడానికి కూడ అవకాశం ఉండేదేమో. కాని 1951లో తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట విరమణ జరిగిన తర్వాత, కమ్యూనిస్టు పార్టీ 1952 నుంచి ఎన్నికల పంథా చేపట్టిన తర్వాత, ప్రజా జీవితంతో నిత్య సంబంధం అవసరం లేకపోయింది. ఎన్నికల సమయంలో తప్ప మిగిలిన సమయాల్లో ప్రజలతో కలిసి నడవవలసిన, ప్రజల పోరాట చైతన్యాన్ని రేకెత్తించవలసిన, ప్రజల పోరాటాలకు

నాయకత్వం వహించవలసిన అవసరం లేకుండా పోయింది. అప్పటివరకూ విజృంభిస్తున్న ప్రజా కళ ప్రయోగాలు మధ్యదారిలో ఆగిపోయాయి. అప్పటిదాకా ప్రజా కళలో ప్రయోగాలు చేసినవారిలో అధిక సంఖ్యాకులు సినిమా రంగానికి తరలివెళ్లి, కళా వ్యాపారీకరణలో, లేదా వ్యాపార కళలో భాగమయ్యారు. తాము ప్రజా కళల గని నుంచి తవ్వి తీసిన అపూర్వ మణి మాణిక్యాలను వ్యాపార కళకు సమర్పించారు. దానితో తెలుగు నాట ప్రజా కళకు సంబంధించిన ఉజ్వల చరిత్రలో ఒక అధ్యాయం సమాప్తమయింది.

ఆ తర్వాత దాదాపు రెండు దశాబ్దాలకు జన నాట్య మండలి ప్రవేశంతో తెలుగు సీమలో ప్రజా కళా ప్రయోగాలు మరొక ఉన్నత శిఖరాన్ని చేరాయి. "రూపంలో స్థానికత, వస్తువులో సాధారణీకరణ" అనే స్టాలిన్ మాటను, "ప్రజల నుంచి ప్రజలకు" అనే మావో మాటను ప్రాతిపదికగా తీసుకున్న విప్లవోద్యమం, జన నాట్య మండలి ప్రజలలో ఉన్న కళారూపాలను తీసుకుని, వాటిని విప్లవీకరించి, వాటిలో విప్లవ సందేశాన్ని నింపి తిరిగి ప్రజలకు అందించాలనే ఒక బృహత్తర కర్తవ్యాన్ని చేపట్టాయి. 1972లో జట నాట్య మండలి ఏర్పడిన నాటి నుంచి 1992లో విప్లవోద్యమ ప్రజా సంస్థల మీద నిషేధంతో, జన నాట్య మండలి పనిచేయలేని స్థితి ఏర్పడేవరకూ రెండు దశాబ్దాలు తెలుగు సీమలో ప్రజా కళ దాని నిజమైన, సమగ్రమైన అర్థంలో రూపసారాలలో, వస్తు శిల్పాలలో ప్రజాజీవనాన్నీ, ప్రజా ఇతివృత్తాన్నీ, ప్రజా ప్రయోజనాలనూ నింపుకుని సాగింది. ప్రజా జీవనంలో ఉన్న వేలకొద్దీ బాణీలో విప్లవ పాటలు, ప్రజలకు తెలిసిన డజన్ల కొద్దీ కళారూపాలలో విప్లవ సందేశం, వేరువేరు కళారూపాల సమ్మేళనంతో కొత్త రూపాల సృష్టికి ప్రయోగాలు, సాంస్కృతిక కార్యకర్తలకూ ప్రజలకూ, కళాకారులకూ ప్రేక్షక శ్రోతలకూ మధ్య రేఖలు చెరిపేసి అందరూ అన్నీ చేయగలరని నిరూపించిన ప్రయోగాలు అసంఖ్యాకంగా జరిగాయి. జన నాట్య మండలి మాత్రమే కాక ఈ కృషిలో కాలక్రమంలో అరుణోదయ, జనసాహితి వంటి రాష్ట్రస్థాయి సంస్థలు లెక్కలేనన్ని స్థానిక సంస్థలు భాగం పంచుకున్నాయి. చివరికి సినిమా వ్యాపారస్తుల దగ్గరి నుంచి వినాయక చవితి మండపాల కళాకారుల వరకూ ప్రతి ఒక్కరూ ఈ ప్రజా కళా విస్ఫోటనను గుర్తించక, అంగీకరించక, పాల్గొనక, అనుకరించక తప్పని స్థితి తలెత్తింది. తర్వాత గడిచిన మూడు దశాబ్దాలలో జన నాట్య మండలి ఉనికిలో

లేకపోయినా ప్రజా కళా మండలి, అరుణోదయ, ప్రజా నాట్యమండలి వంటి సంస్థలు ప్రజా కళకు సంబంధించిన ప్రయత్నాలు, ప్రయోగాలు, అన్వేషణలు కొనసాగిస్తున్నాయి.

అయితే ఇప్పటికీ ప్రజా కళ అంటే ఏమిటనే సమగ్ర నిర్వచనం తయారయిందని అనడానికి లేదు. ఇప్పటికీ ప్రజల వస్తువు లేకపోయినా, ప్రజల రూపం ఉంటే ప్రజా కళ అని ఆ కళా సృజన కర్తలు అనుకుంటున్నారు. కాని కీలకమైన విషయమేమంటే, వ్యవస్థకు ప్రత్యామ్నాయ భావజాలాన్ని ప్రతిపాదించకుండా, ప్రచారం చేయకుండా, ప్రేక్షకులనూ శ్రోతలనూ పఠితలనూ ఆకర్షించకుండా ప్రజా కళ అనే దానికి అర్థం లేదు.

ఎందుకంటే, ఇవాళ వ్యవస్థ, యథాస్థితి ప్రజా జీవితానికి ఆటంకంగా, ప్రమాదకరంగా ఉన్నాయి గనుక ప్రజా ప్రయోజనమంటే వ్యవస్థకూ యథాస్థితికీ వ్యతిరేకంగా మాట్లాడడమే, ఒక ఆచరణ సాధ్యమైన ప్రత్యామ్నాయాన్ని ప్రతిపాదించడమే, ఆ ప్రత్యామ్నాయం వైపు ప్రజలను అంతకంతకూ ఎక్కువగా ఆకర్షించడమే. ఈ ప్రత్యామ్నాయ వస్తువులో రాజీ ఉండడానికి అవకాశం లేదు. అది అనివార్యమైనది, సహజమైనది, అవసరమైనది. అయితే అది ఉన్న స్థితిలో మార్పు గనుక, కొత్తది గనుక దానికదిగా ప్రజలను ఆకర్షించడానికి అనేక ఆటంకాలుంటాయి. ప్రజలలో ఉన్న తప్పుడు చైతన్యం కావచ్చు. ఇది సాధ్యమవుతుందా అనే అనుమానాలు కావచ్చు. తమకో, తమ వర్గానికో ఏదో చిన్న ప్రయోజనమైనా దక్కుతుండడం కావచ్చు. కారణమేదైనప్పటికీ, ప్రత్యామ్నాయం వైపు రావలసిన ప్రజలలో కొందరు వీటిలో ఏదో ఒక కారణం వల్ల రాకుండా ఉండిపోతున్నారు. వారిని ఆకర్షించడమే ఇవాళ ప్రజా కళ లక్ష్యం కావాలి. అంటే ప్రత్యామ్నాయ వస్తువు మాత్రమే కాక, ఆ వస్తువుకు తగిన ప్రజలలో ఉన్న రూపాన్ని తీసుకోవలసి ఉంటుంది. అంటే ప్రత్యామ్నాయ కళకూ ప్రజా కళకూ మధ్య ఒక రసాయనిక సమ్మేళనం జరగవలసి ఉంటుంది. ప్రజా కళే ప్రత్యామ్నాయ కళగా, ప్రత్యామ్నాయ కళే ప్రజా కళగా అవినాభావ, అవిభాజ్య సంబంధంలోకి ప్రవేశించవలసి ఉంటుంది.

* * *

# 2. ప్రత్యామ్నాయ ప్రజాకళలు

- అరుణ, ప్రధాన కార్యదర్శి, జనసాహితి, విజయవాడ.

వినోదాన్ని, ఉల్లాసాన్ని కల్పించే కళారూపాలుగా సినిమాలు, టి.వి., ఇంటర్నెట్‌లు, సెల్‌ఫోన్లు, గుళ్ళు - గోపురాలు, దేవుళ్ళు, రాజకీయ నాయకుల విగ్రహాలను తయారుచేసే కళగా శిల్పకళ, ప్రకృతినీ కాల్పనిక భావనల్నీ చిత్రించటమే పరమావధిగా మారిన చిత్రకళ, భక్తి, శృంగారంతో కూడిన శాస్త్రీయ సంగీతం, కూచిపూడి, భరతనాట్యం వంటి సాంప్రదాయక నృత్యాలు మొదలగునవన్నీ కలసి లలిత కళలుగా, వివిధ కళారూపాలుగా నేడు ప్రాచుర్యంలో వున్నాయి. ప్రజల వాస్తవ జీవితంతో సంబంధం లేని కాల్పనిక భావనలు ఈ కళారూపాల ద్వారా ప్రజా వ్యతిరేక భావజాలాన్ని వ్యాప్తి చేస్తున్నాయి. ఇవి ప్రజల శ్రమైక జీవన సమష్టితత్వాన్ని, వాస్తవాధారిత సృజనాత్మకతను, సంఘటితతత్వాన్ని పక్కదోవ పట్టించేవిగానూ, అనైతికత, అమానవీయత, హింస, క్రూరత్వాలతో కూడిన విషసంస్కృతినీ, వస్తువ్యామోహ సంస్కృతినీ, కెరీరిజాన్ని, హీరోయిజాన్ని పెంచి పోషించేవిగానూ ఉన్నాయి. ఆధిపత్యవర్గాల ప్రయోజనాల కోసం శక్తివంతమైన సాధనాలుగా వినియోగించబడుతున్న ఈ కళారూపాలు దోపిడీవర్గాల సొత్తూ కాదు, సృష్టీ కాదు. ఇవి ప్రజల సమష్టి అవసరాల నుండి, కృషి నుండీ, శ్రమ నుండీ పుట్టాయి. ప్రజలు తమ జీవన పోరాట క్రమంలో సృష్టించుకున్న ఎన్నో సంపదల్లో ఒకటైన ఈ కళలు సమాజ పురోగతిలో ముఖ్యమైన పాత్రనూ పోషిస్తున్నాయి.

సాహిత్యం, సంగీతం, నృత్యం, శిల్పం, చిత్రలేఖనం, నాటకరంగం లాంటి లలిత కళలేగాక ప్రత్యేక కళలైన ఫొటోగ్రఫీ, సర్కస్, డిజైనింగ్ వంటి ప్రాయోజిత కళలు, దున్నటం, విత్తటం మొదలైన సేద్యపు పనులు మరియు తోలును మృదువుగా చేసే నేర్పు వంటి జీవనాధార కళలు మొదలైనవి ఎన్నో వున్నాయి. ఈ కళలు ఎలా పుట్టాయి? ఎలా అభివృద్ధి చెందాయని గతితార్కిక చారిత్రక క్రమంలో పరిశీలించి నపుడు సమాజం అభివృద్ధి చెందుతూన్న దశలో ఆయా కాలాల సమాజ అవసరాలకనుగుణంగా కళలు పుట్టి, అభివృద్ధి చెందాయని తెలుస్తూంది. కళ కోసమే కళలుగా, కళ్ళకు కన్పించే వాస్తవానికి కళలు అతీతమైనవిగా భావిస్తూ, తమ స్వీయానందం కోసమో, తమ ప్రభువులను ఆనందపర్చటం కోసమో, తమ దైవ భక్తిని ప్రకటించుకోవటానికో కళలన్న భావజాలం వ్యాప్తిలో వున్న కాలంలో కళల

స్వభావాన్నీ, కళల అభివృద్ధినీ, కళల లక్ష్యం గురించి ప్రజాతంత్ర కళా దృక్పథ సిద్ధాంతాలు కూడా అభివృద్ధి చెందాయి. కళలు మానవజాతి ఆత్మిక అభివృద్ధిని ప్రభావితం చేసే బలమైన సాధనాలు. వాస్తవ జీవితాన్ని కళాత్మక రూపాల్లో ప్రతిఫలించే సామాజిక చైతన్యపు నిర్దుష్ట రూపాలు.

మట్టిని కుండగా చేయటంలో, చక్రాన్ని ఆవిష్కరించటంలో, దారాన్ని పేని వడికి బట్టను నేయడంలో, కొడవలి, నాగలి, పలుగూ – పారలతో భూమిని సాగుచేసి పంటను పండించటంలో జరిగిన ఆవిష్కరణలలో, పనిముట్లను సృష్టించుకోవటంలో వాటిని అభివృద్ధి చేసుకోవటంలోనే మనిషి కళా సౌందర్యాత్మక దృష్టి ఇమిడి వుంది. ప్రకృతిని పరిశీలిస్తూ, ప్రకృతి నుండి నేర్చుకుంటూ ఆదిమ సమాజపు మానవులు గుహల్లో గీసిన చిత్రాలు, తయారుచేసిన పనిముట్లు – చిత్రకళకు, శిల్పకళకు మూలమైతే, శ్రమించటంలో వచ్చే ఉచ్ఛ్వాస, నిశ్వాసల నుండి లయ, లయకనుగుణంగా పనిముట్లు చేసే క్రమబద్ధమైన ధ్వనుల నుండి వాయిద్యాలు, సామూహిక శ్రమలో లయాత్మకమైన శరీర కదలికల నుండి నాట్యం, చేస్తూన్న శ్రమలో కండరాల వత్తిడిలోంచి వచ్చే అరుపుల నుండి భాష పుట్టినట్లుగా సమాజ పరిణామశాస్త్రం ప్రకారం తెలుస్తూంది. ప్రకృతిలోని మార్పులకు, విపత్తులకు కారణాలు అంతుపట్టక వాటిని సమన్వయించుకునే ప్రయత్నంలో ఊహాజనిత భావనల్ని ఏర్పర్చుకున్న మానవులు, ప్రకృతితో తమ పోరాటంలో ప్రకృతిని అదుపులో పెట్టామన్న మిథ్యాభావం కల్పించిన విశ్వాసం వల్ల ఏర్పడిన ధీమా, ఉత్సాహం, శక్తి వారి పనులను వేగవంతం చేశాయి. ఈ అనుకరణల నుంచి కళారూపాలు వృద్ధి చెందాయి.

సేకరణ ద్వారా ఆహారాన్ని సంపాదించుకున్న ఆదిమయుగం నుండి ఈనాటి ఆధునిక యుగం వరకూ అంటే ఉత్పత్తితో కాకుండా సేకరించటం ద్వారా సంపాదించుకున్న మానవులు సమష్టి శ్రమశక్తితో ఉత్పత్తులను తయారు చేసుకున్న దశ, పెరిగిన ఉత్పత్తుల వలన అదనపు సంపాదన పోగుబడిన దశ, విశ్రాంతి వర్గం ఉత్పత్తి శక్తులపై ఆధిపత్యం వహిస్తూ వర్గ సమాజం ఏర్పడిన దశ, సామ్రాజ్యవాద పెట్టుబడిదారుల అదుపాజ్ఞలతో పరిపాలన జరుగుతున్న నేటి ఆధునిక యుగం వరకూ సమాజం అభివృద్ధి చెందుతూ వస్తున్నట్లుగానే కళలూ పరిణామం చెందుతూ, ఒక్కొక్కసారి ఎగుడుదిగుడుగా అభివృద్ధి చెందుతూ వచ్చాయి. జీవన విధానంతో, జీవన విధానంలోని వాస్తవంతో, వాస్తవం నుండి వచ్చిన పురోగామి

భావాలతో కళలు ముడిపడి వున్నాయి. ప్రతి సమాజమూ, ఒక ఆర్థిక, రాజకీయ, సాంఘిక నిర్మాణమే. ప్రతి వ్యవస్థలోనూ ఉత్పత్తిశక్తుల స్వభావము, అవి అభివృద్ధి చెందుతూన్న స్థాయి, వాటి మధ్య ఏర్పడే ఉత్పత్తి సంబంధాలతో కలిపి వున్న ఆర్థిక నిర్మాణపు పునాది మీద తాత్త్విక, రాజకీయ, న్యాయ, మత, సాహిత్య, కళాత్మక అంశాలతో కూడిన సాంస్కృతిక ఉపరితలమూ కలసి వున్న సామాజిక నిర్మాణంగా వ్యవస్థ వున్నది. ఆర్థిక పునాదిలో అభివృద్ధి జరుగుతూ మార్పులు చెందే కొలదీ సహజంగానే ఉపరితల నిర్మాణము కూడా మార్పులు చెందుతూంది. వివిధ వర్గాల నడుమ సంఘర్షణ ఫలితంగా సమాజ దశలు మారుతూ వస్తూన్న కాలంలో ఆ మార్పులకనుగుణంగా వస్తు రూపాలను మార్చుకుంటూ కళలూ అభివృద్ధి చెందాయి. వ్యవస్థలో మార్పులు రావటం అనేది మానవ సమాజ పురోగతిలో ఒక ముందడుగు – తప్పనిసరి పరిణామం కూడా. శ్రమలో నుంచి పుట్టిన సామూహిక అనుభవాలు, అనుభూతుల కలయిక అయిన ఆదిమకళలు సమష్టి సృష్టిగా, సహకార కళలుగా ప్రారంభమై వర్గాలుగా విభజింపబడిన సమాజంలో వ్యక్తి కేంద్రం కళలుగా, స్వతంత్ర ప్రతిపత్తి గల వర్గ కళారూపాలుగా ఆధునిక యుగం నాటికి మార్పు చెందాయి. కళారూపాలు ప్రజలపై కలిగించే ప్రభావాన్ని గమనించిన దోపిడీవర్గాలు వాటిని తమ భావజాల వ్యాప్తికి శక్తివంతమైన సాధనాలుగా వినియోగిస్తున్నాయి.

ప్రజాకళారూపాలు ప్రజల వాస్తవిక జీవితంతో దగ్గరగా వుంటాయి. నాట్లు వేస్తూ, కోతలు కోస్తూ, వృత్తులు చేసుకుంటూ – ఆ పని క్రమాన్ని, సాధక బాధల్ని, ఆశించే ఫలితాన్ని ఒక లయలో పాడుకుంటూ శ్రమతో కూడిన ఆనందాన్ని పంచుకునేవారు. పెళ్ళిపాటలు, ఉయ్యాలపాటలు వంటి వివిధ సందర్భాలలో పాడుకునే పాటలు, పండుగలు వేడుకలప్పుడు చేసుకునే నృత్యగానాలు ద్వారా సమష్టి ఆనందాన్ని పొందేవారు. శ్రామిక ప్రజల శ్రమ నుండి పుట్టిన ఈ కళారూపాలను, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా జరిగిన పోరాట దశల్లో బూర్జువా ఉదారవాదం సృష్టించిన ఆత్మిక విలువలతో జోడించిన పురాణాలు, మహాకావ్యాలు, వీరగాథలు వంటి కాల్పనిక సాహిత్యం ప్రచారానికి వినియోగించారు. కర్మ సిద్ధాంతాలు, మూఢ సంస్కృతి, మంత్ర తంత్రాలు, తిరోగమన భావజాలంతో కూడిన ఇతిహాసాలు, రామాయణ, మహాభారతాలు ప్రజాకళారూపాలైన జానపదాల ద్వారానే ఆ కాలంలో ప్రత్యామ్నాయ భావాలు కూడా ప్రచారం అయ్యాయి. కళారూపాలలోని రూపాన్ని వినియోగించుకుంటూ ప్రజల వాస్తవ జీవితంతో కూడిన సామాజిక

అంశాలతో, ఇతిహాస అవతార పురుషుల స్థానంలో జానపద నాయకుడిని వుంచుతూ, సమాజంలో ఆ కాలంలోని ప్రాథమిక వైరుధ్యాలను తెలుపుతూ ప్రజాకళారూపాలు సాగాయి. మహాకావ్యాలు, జాతీయ వీరోచిత కావ్యాలు, ప్రేమగీతాలు వంటి ఆత్మిక అంశాలు ఆ తర్వాత ఆధునిక యుగంలో కూడా కవితా వస్తువులుగా కొనసాగాయి.

పేద – ధనిక, ఎక్కువ – తక్కువలతో కూడిన నిచ్చెనమెట్ల కులసమాజం, యజమానులు – సేవకులు, పరిపాలించే పాలకులు – పాలించబడే పాలితులుగా సమాజం రెండు వర్గాలుగా విభజన జరిగింది. ఈ వర్గ సమాజ ఆవిర్భావం నుండీ – అదనపు సంపాదనను పోగేసుకునే దోపిడీవర్గం, తమ వర్గ ప్రయోజనాలకను గుణంగా ప్రజలను మలచుకోవటానికి కావల్సిన విధానాలను, సంస్కృతిని రూపొందిస్తోంది. దానిని ఎదుర్కొంటూ ప్రజానుకూల వర్గం దోపిడీ పీడనలు లేని సామాజిక సమానత్వం కోసం ప్రజా సంస్కృతిని నెలకొల్పటానికి సంఘర్షిస్తూంది. మెరుగైన జీవనం కోసం, సమానత్వ సమాజం కోసం పోరాడే ఈ వారసత్వ సంస్కృతి ఒక తరం నుండి మరో తరానికి అందించబడుతూనే వుంది. సంస్కృతికి మూలం శ్రమజీవులు, శాస్త్రజ్ఞులు, కళాకారులు. శ్రమ నుండి పుట్టిన ఆవిష్కరణలతో శాస్త్రజ్ఞానమూ, కళా సౌందర్యాత్మకత మన జీవన విధానాన్ని, సంస్కృతినీ రూపొందిస్తాయి. సమాజంలో శ్రమజీవులకు, దోపిడీదారులకు మధ్య వున్న సంబంధాలు, వారి మధ్య వున్న వైరుధ్యాల అభివృద్ధి స్థాయి, మనిషి వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేసే పరిస్థితులు – కళల స్వరూపాన్ని, అభివృద్ధిని ప్రభావితం చేయటంలో ముఖ్య పాత్ర వహిస్తున్నాయి.

ప్రాచీన కాలంలో పీడిత ప్రజల తాత్త్విక భావజాలాన్ని ప్రచారం చేసిన చార్వాకం, బౌద్ధం, మధ్యయుగాలలో భక్తి ఉద్యమాలైన శైవ – వైష్ణవ – సూఫీ – కవుల నిరసనోద్యమాలతో కూడిన సాంస్కృతిక, సామాజిక భావాలు, ఆధునిక ప్రజాస్వామ్య యుగం ప్రవేశించేనాటికి ముందే వేమన, పోతులూరి వీరబ్రహ్మంలు ప్రజల భాషలో, సమాజ పరిస్థితులకు అద్దం పడుతూ వాస్తవ జీవితాలను రాసిన ప్రజాసాహిత్యం, పల్నాటి బ్రహ్మన్న 'చాపకూడు సిద్ధాంతం' ప్రచారం చేసిన సామాజిక సమానత్వ బోధనలు వంటి ప్రత్యామ్నాయ సంస్కృతి ప్రజాకళారూపాల ద్వారా వ్యాప్తి జరిగింది. ప్రజాకళారూపాలైన జానపద కళారూపాలలో ముఖ్యమైనవి – హరికథ, బుర్రకథ, జముకుల కథ, ఒగ్గు కథ, కోలాటం, కోయ నృత్యాలు, సుద్దులు, చుట్టుకాముడు, చిందు భాగోతం, చెక్క భజనలు, డప్పుల నృత్యం, తప్పెట గుళ్ళు,

తోలుబొమ్మలాట, థింసా నృత్యం, పాములవాడు, పిట్టలదొర, బతుకమ్మ పాటలు, బుడబుక్కలవాడు, బైరాగి తత్వాలు, భట్రాజు గీతాలు, యక్షగానం, రేల పాటలు, లంబాడీ నృత్యం, వీధి భాగవతం, వీధి నాటికలు, మొదలైనవి.

జాతీయోద్యమ కాలంలో బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యపరచటంలో భాగంగా పాత పౌరాణిక, జానపద కళారూపాలను తీసుకుని సమకాలీన వస్తువుతో నాటకాలను, కళారూపాలను తయారుచేసి ప్రదర్శించారు. జానపద ఇతివృత్తంతో కోరాడ రామచంద్రశాస్త్రి రాసిన 'మంజరీ మధుకరీయం' నాటకాన్ని, కొక్కొండవారు రాసిన 'నరకాసుర విజయాన్ని', చిలకమర్తి లక్ష్మీనరసింహం, తిరుపతి వేంకట కవులు భారత గాధలననుసరించి రచించిన 'రసపుత్రి', 'పాండవోద్యోగ విజయం' నాటకాలను రౌలత్ చట్టం, జలియన్ వాలాబాగ్ దురంతాన్ని వస్తువుగా తీసుకుని పుండరీకాక్షయ్య రాసిన 'పాంచాలి పరాభవం' నాటకాన్ని వీటితోపాటుగా సాంఘిక నాటకాలనూ, నృత్యగేయాలను రచించి ప్రదర్శించారు. శ్రీపాద కృష్ణమూర్తి రాసిన 'తిలక మహారాజు', డి.సీతారామయ్య రాసిన 'స్వరాజ్య ధ్వజము', జంద్యాల అయ్యంవారి శాస్త్రి రాసిన 'ఆలీ ప్రభృతుల నిర్భంధము', బుద్ధవరపు పట్టాభిరామయ్య రాసిన 'మాతృదాస్య విమోచనము', మద్దూరు అన్నపూర్ణయ్య రాసిన 'చిచ్చుల పిడుగు' మొదలగు సాంఘిక నాటకాలను రూపొందించారు.

దేశవ్యాప్తంగా జాతీయోద్యమ కాలంకన్నా ముందే భక్త తుకారాం, కబీరు వంటివారి భక్తి ఉద్యమాలు, సావిత్రీబాయి, జ్యోతిరావు పూలేలు నిర్వహించిన సంస్కరణ ఉద్యమాలు, జాతీయోద్యమ కాలంలో సాగిన నారాయణగురు, పెరియార్ రామస్వామి మొదలైనవారు సమాజంలోని అసమానతలకు వ్యతిరేకంగా ప్రత్యామ్నాయ భావజాలంతో సంఘర్షణలు జరిపారు. ఎప్పటికప్పుడు రాజకీయ, సాంస్కృతిక అవసరంగా ఆ తరానికి అవసరమైన భావ వాతావరణం – దానికి తగ్గట్టుగా కళారూపాలు అభివృద్ధి చెందుతూ వచ్చాయి. జాతీయోద్యమ కాలంలో సాంఘిక సంస్కరణోద్యమాలూ వెల్లివిరిసాయి. మత ఛాందసత్వానికి, కుల వివక్షకు, అవిద్యకు వ్యతిరేకంగా, బాల్యవివాహాల రద్దు కోసం, వితంతు పునర్వివాహాల కోసం అనేక ఉద్యమాలు నడిచాయి. వలస పాలన కల్పించిన నూతన ఉత్పత్తి అవకాశాలను అంది పుచ్చుకుని ఫ్యూడల్ సంబంధాల బానిసత్వాన్ని, అణచివేతనూ ప్రశ్నిస్తూ సాహిత్య, కళారూపాలు వచ్చాయి. త్రిపురనేని రామస్వామి, అమంచర్ల గోపాలరావు,

ముద్దుకృష్ణ, చలం మొదలగువారు ప్రత్యామ్నాయ సాహిత్యంగా పురాణ గాథలను తిరగరాశారు. త్రిపురనేని హేతువాద సాహిత్యంతోపాటు అర్థంగాని సంస్కృత భాషలోని బ్రాహ్మణ వివాహ విధుల స్థానంలో అర్థమయ్యే తెలుగులో ప్రత్యామ్నాయ వివాహ విధులను రూపొందించారు. 'మాకొద్దీ తెల్లదొరతనమూ' అంటూ గరిమెళ్ళ, 'మాకొద్దీ నల్లదొరతనమూ' అంటూ కుసుమ ధర్మన్న మొదలైనవారు, ప్రజల్ని కార్యోన్ముఖుల్ని చేసే గేయాలని రూపొందించారు. తెలుగుభాషా వికాసం కోసం, సంస్కృతి కోసం, తెలంగాణలో సురవరం ప్రతాపరెడ్డి, భాగ్యరెడ్డివర్మ తదితరులు ప్రత్యామ్నాయ భావజాలాన్ని సాహిత్యము, వివిధ కళారూపాల ద్వారా ప్రచారం చేశారు. కందుకూరి వీరేశలింగం, సామినేని ముద్దు నరసింహం మొ॥వారు నాటకాలు, ప్రహసనాలు, కవితలు, గేయాలు, కథలు, వ్యాసాలు మొదలైన కళారూపాలనుపయోగించి సమకాలీన సమస్యలపై తిరుగుబాటు జెండానెగురవేశారు. గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' నాటకం, రచనలు ఈనాటికీ సమకాలీనమే. గురజాడ 'ఆడపిల్లల పాటలు' అనే ప్రత్యేక శీర్షికతో పుత్తడి బొమ్మ పూర్ణమ్మ, కన్యక వంటి సాహిత్యాన్ని తీసుకువచ్చారు. వీటిని కళారూపాలుగా నేటికీ ప్రదర్శిస్తూ వున్నారు.

మనదేశంలో వలస పాలన నాటి రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఫాసిజానికి వ్యతిరేకంగా ఎలుగెత్తి నినదించిన ప్రపంచ పరిణామాలలో భాగంగా సామ్యవాద సిద్ధాంతాల ప్రచారానికై ప్రజానాట్యమండలి, మరుగున పడిన కళారూపాలను వెలికితీసి ఎన్నో జానపద కళారూపాలను పునరుద్ధరించింది. ప్రజానాట్యమండలి రూపొందించిన 'కష్టజీవి', 'అల్లూరి సీతారామరాజు', 'స్టాలిన్ గ్రాడ్' వంటి బుర్రకథలు, 'హిట్లర్ భాగవతం', 'సిమ్లా భాగవతం', 'కత్తీ, సుత్తీ నృత్యం', 'పంటసిరి నృత్యం', 'చెంచు వేషం', 'కోయ వేషం', 'ఎర్ర సైనికుడి నృత్యం', 'తోలు బొమ్మలాటలు', షాడో ప్లేలు మొదలగు కళారూపాలు ప్రజల్ని చైతన్యపర్చాయి. భూస్వామ్య విధానాలకు వ్యతిరేకంగా, సామ్రాజ్యవాద ఫాసిజానికి వ్యతిరేకంగా, కులవివక్షకు, స్త్రీల, దళితుల, ఆదివాసీల అణచివేతలకు వ్యతిరేకంగా సంఘాలు ఏర్పడ్డాయి. ఉద్యమాలు నడిచాయి. సుంకర సత్యనారాయణ, నాజర్, కానూరి వెంకటేశ్వరరావు, డా॥ గరికపాటి రాజారావు, మిక్కిలినేని, కర్నాటి లక్ష్మీనరసయ్య, కోసూరి పున్నయ్య, వాసిరెడ్డి భాస్కరరావు, కాకరాల మొదలైన కళాకారులూ కార్యకర్తలూ అవిరామ కృషి చేశారు. ఫాసిజాన్ని వ్యతిరేకరించటంతో పాటుగా

బెంగాల్ కరువును చిత్రిస్తూ, కారణాలను తెలుపుతూ కళారూపాలను రూపొందించారు. బెంగాల్ కరువుపైన, జాతీయోద్యమం గురించి ఆ తర్వాత వచ్చిన తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం గురించి, ప్రజా పోరాటాల స్ఫూర్తిని తెలియచేస్తూ బెంగాలీ చిత్రకారుడు చిత్తప్రసాద్ గీసిన చిత్రాలు ఇప్పటికీ చైతన్యాన్ని నింపుతూనే వున్నాయి. ప్రజానాట్యమండలి కళారూపాలలో మహిళలు పాల్గొనేలా చైతన్యపరచింది. ఉప్పు గుండూరు బాలికల దళము, కృష్ణాజిల్లాలో, గుంటూరు జిల్లాలో, తెలంగాణలో మహిళాదళాలు బుర్రకథలను, నృత్య నాటికలను, ప్రదర్శించాయి. ఆనాటి సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితుల్లో ప్రజాతంత్ర సంస్థలు దోపిడీ పీడనలకు గురౌతున్న మహిళలను, దళితులను, ఆదివాసీలను సంఘటితపరిచి, దోపిడీకి వ్యతిరేకంగా ఉద్యమింపచేసిన కృషి – ఆ కృషితో పాటుగా నడిచిన సంఘ సంస్కరణోద్యమాలు జరిపిన భావజాల వ్యాప్తి విలువైనది.

తెలంగాణాలో సాగిన భూస్వామ్య వ్యతిరేక సాయుధ రైతాంగ పోరాట (1946–51) క్రమంలో ప్రజానాట్యమండలి, ఇతర ప్రజాసంఘాలు రూపొందించిన నాటకాలు, బుర్రకథలు, సుద్దులు, నృత్యగేయాలు, చిత్రకళ, మొదలైనవి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవటంలో ప్రముఖపాత్ర వహించాయి. తెలంగాణ సాయుధ పోరాట విరమణ తర్వాత అనేకమంది ప్రజానాట్యమండలి కళాకారులు సినిమారంగంలోకి, వ్యక్తిగత పనులలోకి మళ్ళారు. ఆ తర్వాత వచ్చిన శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం(1967–1970)లో వెంపటాపు సత్యం, సుబ్బారావు పాణిగ్రాహి మొదలైనవారు జముకుల కథ, బుర్రకథ, నృత్యగేయాలు, పాటలతో ప్రజలని ఉద్యమాల్లోకి కదిలించారు. 'దిక్కు మొక్కు లేని జనం, ఒక్కొక్కరు అగ్నికణం, సింహ కంఠ నాదంతో, వస్తారిక కాచుకోండి' అని ఆ ఉద్యమం పాలకవర్గాలకు సవాల్ విసిరింది. ఆ కాలంలోనే సాగిన నక్సల్బరీ రైతాంగ పోరాటం ఈ అసమాన వ్యవస్థను కూలదోసి నూతన ప్రజాస్వామిక వ్యవస్థను నిర్మించటానికి ఎన్నుకున్న మార్గాలు, దృక్పథాలు, ఎత్తుగడలు విషయంలో మన సమాజానికి అన్వయించుకో గలిగిన శాస్త్రీయ పంథాపై చర్చల నేపథ్యంలో కొన్ని కొత్త కళారూపాలను వివిధ సంస్థలు రూపొందించాయి.

నక్సల్బరీ, శ్రీకాకుళ తిరుగుబాట్ల ప్రభావంతో సమాజంలో విప్లవాత్మక మార్పు కోసం కృషిచేయాలన్న తపన వున్న పాత, కొత్త తరాల రచయితలు, మేధావులు

కలసి 1970లో విప్లవ రచయితల సంఘాన్ని ఏర్పాటుచేశారు. 1972లో ప్రజాసాంస్కృతికోద్యమ దృక్పథంతో నవోదయ సంస్థ ఏర్పడింది. 'జీవనాడి' పత్రికను నడిపింది. ఈ సంస్థ ఆ తరువాత జనసాహితిలో విలీనం అయ్యింది. వి.ర.సం. సాంస్కృతిక దళం జన నాట్యమండలి ముఖ్యంగా గద్దర్, వంగపండు తదితరుల సారధ్యంలో నడిచింది. తర్వాత కాలంలో ఆ సంస్థ వర్గ శత్రు నిర్మూలనా పంథా దృక్పథానికి అనుగుణంగా అనేక కళారూపాలను రూపొందించింది. 'ఒగ్గు కథ', 'రగల్ జెండా', 'కంజెర కథ', జానపద కళాప్రక్రియలతో రూపొందిన 'నాంది', 'పంట' తదితర నాటకాలను ఆయా సందర్భాలకు తగిన అనేక పాటలతో నృత్య కళారూపాలతో ప్రజల్ని చైతన్యపరుస్తున్నారు. ఆ తర్వాత వారు ప్రజా కళామండలిగా ఏర్పడి సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహిస్తూన్నారు. మరో విప్లవ సాంస్కృతిక సంస్థ 'అరుణోదయ', రామారావు, కానూరి వెంకటేశ్వరరావు, విమల, గోరటి వెంకన్న తదితరుల సారధ్యంలో నడుస్తూ – 'రాజకీయ వీధి భాగోతం', 'బుర్రకథ', 'హరికథ', పాటలు, అభినయ గేయాలు తదితర కళారూపాలతో ప్రజల్ని చైతన్యపరుస్తున్నారు. గత సంవత్సరాల పోరాట అనుభవాలలోని మంచి చెడ్డలను స్వీకరిస్తూ, నూతన ప్రజాతంత్ర సాహిత్య, సాంస్కృతికోద్యమ లక్ష్యంతో – దోపిడీకి గురౌతున్న అశేష ప్రజానీకపు పక్షాన నిలబడుతూ – వారి జీవన సంఘర్షణ నుండి ఉద్యమ చైతన్యాన్ని అందించే ప్రజాసాహిత్యాన్ని, సాంస్కృతికోద్యమాన్ని నిర్మించే బాధ్యతతో జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య 1978లో ఏర్పడింది. సమకాలీన సమస్యలపై ఎప్పటికప్పుడు సామాజిక అవసరాలకనుగుణంగా అనేక ప్రజాకళారూపాలను రూపొందించింది. యక్షగానాన్ని, నృత్య నాటికతో మేళవించి 'జనవాహిని కదిలింది' రూపకాన్ని – 'కరువు కథ', 'బడిపిల్లల కథ', 'దునియా కే మజ్దూర్ ఏక్ హో', తమ జీవితాల్లోకి ప్రవేశించిన దోపిడీదారుల ఆగడాలను తమ సంఘటిత శక్తితో ఎదుర్కొన్న గిరిజనుల అనుభవాలతో కూడిన 'గోవుల గొట్టు' నాటకాలను హైదరాబాద్ 'నవోదయ' సంస్థ రూపొందించగా వాటిని విస్తృతంగా ప్రదర్శించారు. కార్మిక సమస్యలను, యూనియన్ల నగ్న స్వరూపాన్ని తెలియచేస్తూ 'యూనియన్ జిందాబాద్', గ్రామీణ ప్రాంతాల్లో బడుగువర్గాల దుస్థితిని తెలియచేసిన 'జనం తీర్పు', 'పంచాయితీ', 'భూమి కోసం', 'ఈ భూమి మనదిరా!', సుంకర రచించిన 'గెరిల్లా', జాతీయోద్యమం నుండి ఇటీవల వరకూ సాగిన వివిధ ప్రజా ఉద్యమాలను చిత్రించిన 'చైతన్య రథం', గురుశరణ్ సింగ్ రచించిన 'ఇంక్విలాబ్ జిందాబాద్', 'గాలి బుడగ' (హవాయి

గోలి), కొండమొదలు గిరిజన రైతాంగ పోరాటాన్ని తెలియచేస్తూ గిరిజనులచేతే రూపొందించబడిన ఎర్రపూలు నృత్యరూపకం, జానపద గేయాలను జనంపాటలుగా రూపొందించిన ప్రక్రియగా 'జానపద గేయాలు – జనం పాటలు' పుస్తకాన్ని తీసుకువచ్చారు. కొండమొదలు గిరిజనులైన 12 మంది పురుషులు, 20 మంది మహిళలచేత రూపొందించి ప్రదర్శించిన 'గిరిధ్వనులు' 'రైతుకూలీలేకమైతే', 'మీరైతే ఏంచేస్తారు', బీహార్ ప్రెస్ బిల్లుపై తయారుచేసిన 'కలాలకు సంకెళ్ళు లేవు', 'కుక్కల్ని తరిమిన కుందేళ్ళు', 'ప్రభంజనం', 'శస్త్ర చికిత్స', తదితర నాటకాలను, వీధి నాటికలైన – నాగార్జునసాగర్ అణువిద్యుత్ కేంద్ర ఏర్పాటుకు వ్యతిరేకంగా 'అణుభూతం', రిజర్వేషన్ల కోసం మండల కమీషన్ రికమెండేషన్‌ని సమర్ధిస్తూ 'ప్రతిభా! ఓ ప్రతిభా', పెరుగుతున్న ధరలకు వ్యతిరేకంగా 'ధరలు బాబోయ్ ధరలు', సారా వ్యతిరేక ఉద్యమంలో భాగస్వాములవుతూ 'శబ్దం', బలియాపాల్ ఉద్యమాన్ని తెలియచేసే 'రాకెట్ రాకాసి' సామ్రాజ్యవాద ప్రపంచీకరణతో మొదలైన ఫాక్టరీల మూసివేతలకు వ్యతిరేకంగా 'లాకౌట్', హక్కుల అణచివేతను ఖండిస్తూ 'రాజ్య హింస', సత్యసాయిబాబా ప్రశాంత నిలయంలో జరిగిన ఆరుగురి హత్య సంఘటనను బహిర్గతపరుస్తూ 'హత్య! బాబోయ్' నాటకాలను జనసాహితి రూపొందించింది. కారంచేడు, చుండూరు దళితుల హత్యాకాండలను నిరసిస్తూ ఉద్యమాల్లో పాల్గొంటూ అనేక పాటలు, రూపకాలతోపాటుగా చుండూరు ఘటన జరిగిన వెంటనే 'నరమేధం' నాటికను తయారుచేసి ప్రదర్శించింది. పాటల క్యాసెట్‌ను రూపొందించింది. బాబ్రీ మసీదు, రామజన్మభూమి సమస్యపై 'రామజన్మభూమి కాదురో' వీధి నాటికను రాసి ప్రదర్శించింది. ప్రస్తుతం మాజీ ప్రధాని పి.వి. నరసింహారావు శతజయంతి సభలను పాలకవర్గాలు నిర్వహిస్తున్నాయి. ఆయన అమలు చేసిన ప్రపంచీకరణ విధానాలే దేశాభివృద్ధికి దోహదపడ్డాయని పాలకవర్గాలు నిస్సిగ్గుగా ప్రకటిస్తున్నారు. పి.వి. నరసింహారావు ప్రభుత్వం సామ్రాజ్యవాదానికి సాగిలపడుతూ అనుమతించిన ప్రపంచీకరణ అనే దేశద్రోహ చర్య వల్ల మన దేశ ప్రజలు మరింతగా దోపిడీకి గురౌతూ పరాధీనులవుతారన్న విషయాన్ని బహిర్గతపరుస్తూ 'అప్పుల భారతం' వీధి భాగవత యక్షగాన కళారూపాన్ని రూపొందించారు. నాలుగు రాష్ట్రాలలో హిందీ, ఇంగ్లీషు వ్యాఖ్యానాలతో ఇప్పటివరకూ అనేక ప్రదర్శనలిచ్చారు. ఎమర్జెన్సీ కాలంలో జరిగిన పోలీసుల అత్యాచారాలను ఛాయానాటిక ప్రక్రియలో ప్రదర్శించారు. 'మన్యం మేల్కొంది', 'ఎత్తిన జెండా దించకోయ్' నిశ్చల దృశ్యరూపకాలను హిందీ, ఇంగ్లీషు,

బెంగాలీ వ్యాఖ్యానాలతో ప్రదర్శించారు. 'సుద్దులు', 'ఆశు కవిత్వాలను' మేళవించి తెలంగాణ, చల్లపల్లి, శ్రీకాకుళం, కొండమొదలు పోరాటాల అమరులను స్మరిస్తూ 'నెత్తుటి దీపాలు' నృత్య నాటికను, వంగపండు రాసిన 'సిక్కోలు యుద్దాన్నీ', 'భూమి భాగోతాన్ని', 'అల్లూరి సీతారామరాజు' బుర్రకథను, శ్రీకాకుళ గిరిజనోద్యమంలో అమరులైన కా॥ కోరన్న, మంగన్నలను స్మరిస్తూ ఆ ఉద్యమ క్రమాన్ని తెలియచేస్తూ భూపాల్ రాసిన 'పోరుదారి' నృత్య నాటికను, వీటితోపాటుగా 'పాములవాడు', 'జంతర్ పెట్టె', 'బుడబుక్కలవాడు', 'పిట్టలదొర', 'ఒగ్గు కథ', 'బుర్రకథ', 'తోలు బొమ్మలాట' కళారూపాలను, భువన విజయంకు ప్రత్యామ్నాయంగా 'జన విజయం' కళారూపాన్ని, 'కోలాటం', 'చుట్టుకాముడు', 'థింసా', సామూహిక నృత్యాలను రూపొందించి అనేక ప్రదర్శనలిచ్చారు. సామాజిక, రాజకీయ, సాంస్కృతిక అంశాలతో ప్రజాదృక్పథాన్ని ప్రతిబింబిస్తూ సాగిన ఈ ప్రజాకళారూపాలను ప్రజా కళాకారుల సమాఖ్య కొనసాగిస్తూంది.

ఈ అసమాన సమాజాన్ని రూపుమాపి సమసమాజాన్ని నిర్మించాలన్న లక్ష్యంతో సామ్యవాద భావజాల సాంస్కృతిక సంస్థలతోపాటుగా సామాజిక సంస్థలు, దళితసంఘాలు, మహిళాసంఘాలు, విద్యార్థి సంఘాలు వివిధ సందర్భాలకు స్పందిస్తూ కళారూపాలను రూపొందించారు. కారంచేడు సంఘటన సందర్భంగా దళిత మహాసభ ఏర్పడింది. ఆ చైతన్యంతో అనేక పాటలు, నాటికలు, చిత్రకళ వెలువడ్డాయి. 'దళిత పులులమ్మ! కారంచేడు భూస్వాములతోటి కలబడి నిలబడి పోరుచేసిన' పాట ఆ రోజుల్లో ఉద్యమ వ్యాప్తిలో భాగమయింది. 'ఎన్నిసార్లు ఈ ఘోరాలు, ఎంతమందిమి ఒరుగుతాము, దళితన్న దండు కట్టాకుంటె బతుకలేము' అంటూ చుండూరు నరమేధం సందర్భంగా వచ్చిన సాహిత్య కళారూపాలు, 'మనుధర్మానికి మరణ శాసనం రాస్తున్నామిదిగో!' అంటూ రోహిత్ వేముల మరణం సందర్భంలో వచ్చిన పాటలు, ఆధిపత్య భావజాలాన్ని నిరసిస్తూ చిత్రించిన కళ, ఇతర కళారూపాలను రూపొందించారు. మహిళల మీద జరుగుతున్న అత్యాచారాలకు హింసకు వ్యతిరేకంగా వచ్చిన కళారూపాలు భావజాలరంగంలో సంఘర్షణకు ఊతమిస్తున్నాయి. మూఢనమ్మకాలు, మతోన్మాదాలకు వ్యతిరేకంగా, రామజన్మభూమి, బాబ్రీ మసీదు సంఘటన సందర్భంగా చార్వాక రామకృష్ణ 'శంభుక రథయాత్ర'ను కళారూపాలతో నిర్వహించారు. ఆ సందర్భంగా త్రిపురనేని రచనలు 'శంభుకవధ', 'ఖూనీ' నాటకాలను ప్రదర్శించారు. బాబాల బండారాలను బట్టబయలు చేస్తూ,

అనేక మేజిక్ షోలను, నృత్య నాటికలను, ఛాయా నాటికలను రూపొందించారు. ప్రస్తుత కరోనా కాలంలోనూ వ్యక్తులూ, సంస్థలూ స్పందిస్తూ సాహిత్యరూపాలను, చిత్ర కళారూపాలను రూపొందిస్తున్నారు.

వివిధ సంస్థలూ, వ్యవస్థలూ వారి వారి ఆశయాలకనుగుణంగా ప్రజా కళారూపాలను రూపొందిస్తున్నారు. సినిమా – కళారంగంలోనూ జనజీవన సమస్యలను సృజనాత్మకంగా చిత్రిస్తున్నారు. ఐతే పరిష్కార మార్గాలను చూపించటంలో అవి సంస్కరణవాదంగానో, వ్యక్తిగత హింసావాదంగానో, కాకుంటే వ్యక్తిగత సంస్కరణలుగానో పాలకవర్గాల అనుకూల భావజాలంతోనో కూడుకునే ఎక్కువగా వుంటున్నాయి. ఎంతగా సినిమాలు, టి.వి.లు., ఇంటర్నెట్‌లు ప్రభంజనం చేస్తున్నా వ్యవసాయాధారిత గ్రామీణ సమాజం, ఆదివాసీ సమాజాలు బలంగా వున్న మన వ్యవస్థలో శ్రమైక జీవన సమష్టి సౌందర్య సృష్టి అయిన ప్రజాకళా రూపాలను ప్రజలు ఆదరిస్తున్నారు, స్వాగతిస్తున్నారు. లఘుచిత్రాలు, లఘునాటికలు, వీధి నాటికలు, కవితాపఠనాలు, అభినయ నృత్యాలు, చిత్రకళా ప్రదర్శనలు ఆయా సందర్భాలకనుగుణంగా రూపొందించి బహిరంగ ప్రదేశాలలోనూ జన సమూహాల మధ్య కొంతమంది కళాకారులు ప్రదర్శిస్తున్నారు. ఇవి ఇంకా వ్యాప్తిలోకి రావాలి. ప్రస్తుత సంక్షోభ కాలంలో, దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగా ఉద్యమాలను ఎక్కుపెట్టవలసిన కాలంలో ప్రజాకళారూపాలు మరింతగా పదునెక్కాలి. భూస్వామ్య సంస్కృతికి వ్యతిరేకంగా ప్రజాస్వామిక సంస్కృతినీ, సామ్రాజ్యవాద సంస్కృతికి వ్యతిరేకంగా జాతీయ సంస్కృతినీ, మూఢవిశ్వాసాల అశాస్త్రీయ సంస్కృతికి వ్యతిరేకంగా శాస్త్రీయ సంస్కృతినీ, మతతత్త్వ సంస్కృతికి వ్యతిరేకంగా లౌకిక సంస్కృతినీ సాధించే దిశలో ప్రజాకళారూపాలను నూతన సాంకేతిక కళా ప్రక్రియలను మేళవించి తయారుచేసుకోవలసిన కర్తవ్యాన్ని ప్రజాసాంస్కృతిక సంస్థలు స్వీకరించాలి.

* * *

# 3. కళ – సంస్కృతి – మానవుడు

– కె. శాంతారావు, సహవాసీ సాంస్కృతిక కేంద్రం, హైదరాబాద్

**"మానవ పరిణామ క్రమంలో పశువు నుండి మనిషిని వేరుచేసింది కళ"**

– ఏంగెల్స్

అంటే మానవ జీవన చరిత్ర అంతా మానవ కళా చరిత్రే అని మనం వ్యాఖ్యానించుకోవచ్చు.

ఇక్కడ కళ అంటే మనిషి మానసిక జీవనం అని అర్థం చేసుకోవాలి. అనుభవాలు, అనుభూతులు, స్పందనలు, కలలు, భావాలు, అంతిమంగా జ్ఞానం – ఇత్యాదివన్నీ మనస్సులో కలిగేవే. నైరూప్యాలు.

జీవితం నవరస భరితం అన్నారు పెద్దలు.

రౌద్రం, వీర, శృంగార, హాస్య, భయ, భీభత్స, కరుణ, శాంత, అద్భుత – ఈ నవరసాలు మనిషి జీవితంలో ఉన్నవే.

మనిషి భౌతికంగా జీవించడం ఎంత వాస్తవమో

మానసికంగా జీవించడం కూడా అంతే వాస్తవం.

అయితే పశుపక్ష్యాదులకు ఈ మానసిక జీవితం ఉండదా...? అని ప్రశ్నిస్తే, తరతమ స్థాయిల్లో వాటి పరిణామాన్ని అనుసరించి ఉంటుంది. ఏనుగు మెదడు కన్నా మనిషి మెదడే పెద్దది.

కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం – ఈ పంచేంద్రియాలను మెదడు సమన్వయ పరుస్తుంది. ఇంద్రియాల ద్వారా జ్ఞానం లభిస్తుంది కనుక (నాలెడ్జ్ కేమ్ ఫ్రమ్ సెన్సెస్) జ్ఞానేంద్రియాలు అని అన్నారు.

మనిషికి ఇంతటి శక్తివంతమైన మెదడు ఎలా ఏర్పడింది? ఈ ప్రశ్నకు జవాబు కూడా ఏంగెల్స్ వివరించాడు. 'వానరుడు నరుడుగా మారిన క్రమంలో శ్రమ పాత్ర'.

మైదానాల నుండి కొండలు ఎక్కే క్రమంలో ముందరికాళ్ళు చేతులుగా మారాయని, చేతుల్లో పట్టు ఏర్పడేందుకు నాలుగు వేళ్ళకులోభిముఖంగా బొటనవ్రేలు

ఏర్పడిందని ఈ బొటనవ్రేలు, చేతులు మెదడుతో ఏర్పడిన నాడీ మండల వ్యవస్థ నానాటికి శక్తివంతమై మనిషిగా, ఓ అజేయమైన, అద్భుతమైన ప్రాణిగా అవతరించాడని తెలిపారు.

తన రక్షణ కోసం ఆది మానవుడు తొలిగా ఓ మొనకలిగిన రాయిని పట్టుకుని వేల లక్షల సంవత్సరాలు తిరిగినట్టు చారిత్రక చిత్రాలు చెప్తున్నాయి. అదే తొలి ఆయుధం. సాధనం, పనిముట్టు. అవసరం నుండి భావం. భావం నుండి రూపం (ఉత్పత్తి పరికరం) అవతరించినట్టు తెలుస్తున్నది. తొలుత భావం (ఆలోచన) అని గమనించాలి ఆలోచన నుండి ఆచరణ (క్రియ) సాధ్యమైంది. ఇల్లా అవసరం - భావం (ఆలోచన) - ఆచరణ (రూపం, క్రియ, ఫలితం) గొలుసుకట్టుగా మనిషి నిత్య దైనందిన జీవితంలో భాగమైంది.

మనిషి మాత్రమే తనకు కావాల్సిన సాధనాలను, ఆయుధాలను, పనిముట్లను తయారుచేసుకోగలడు. ఉపయోగించుకోగలడు. మెరుగైన జీవనం కోసం ఈ శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం జీవితంలో అనివార్యమైంది. ఎప్పటికప్పుడు రుజువు అవుతున్న జ్ఞానంగా నిక్షిప్తమైంది.

ఎవరి అనుభవాలు వారికే జ్ఞానంగా గాక, మరొకరికి జ్ఞానంగా పరిణమించింది. చరిత్రగా మారింది. ఈ పారంపర్యత విస్తరణ అంతా కూడా కళా జీవితం (మానసిక జీవితం)తో ముడిపడి ఉన్నది. ఆహార అన్వేషణలో, ఆవాసం, దుస్తులు వంటి ప్రాథమిక సౌకర్యాలు సమకూర్చుకోవడంలో జ్ఞానం అంతర్భాగమైంది.

ప్రకృతి రహస్యాలను ఛేదించడంలో, లోబరుచుకోవడంలో తనకు భౌతికంగా వశమయింది ప్రతిదీ విజ్ఞానంగా మారింది. తక్కినదంతా అజ్ఞానంగా మిగిలిపోయింది.

భౌతిక వాదానికి విజ్ఞానం (నిరూపితమైన శాస్త్రజ్ఞానం) ప్రాతిపదిక అయితే భావవాదానికి అజ్ఞానం (కేవలం నమ్మకం) ప్రాతిపదిక అయింది.

విశ్వం అంతమా? అనంతమా?

ఈ ప్రశ్నకు సమాధానం మనిషికి ఇంకా దొరకలేదు. దొరుకుతుందా? లేదా? తెలియదు. అందుకే భావవాదం చాలా బలంగా మనిషిలో ఇప్పటికీ నాటుకుని ఉంటుంది. దీనికి ఆధ్యాత్మికత, ధార్మికత పేర్లు ఏవైనాగాని మనిషికి అదో ఊరట.

సాంత్వన ఓ బలం చేకూరింది. ఓ అతీతమైన శక్తి (దైవం) ఏదో ఈ విశ్వాన్ని (లోకాన్ని) కాపాడుతుందనేది భావవాదం. ప్రతి మతానికి ఈ భావవాదమే పునాది.

పురాణ జ్ఞానమంతా ఏ దేశంలోనైన ఇలాంటి నమ్మకాలు విశ్వాసాలు, కల్పనలతో (భావవాదంతో) మిళితమై ఉంటుంది. ఈ విశ్వాన్ని, తమను కాపాడుతున్నదన్న ఆ అతీతమైన శక్తి (దైవం) చుట్టూ అల్లుకుని పోతుంది. మానవ సంబంధాలు, ఆచార వ్యవహారాలు కట్టుబాట్లు, ఆహారపు అలవాట్లుతోపాటు ఈ ధార్మిక (నైతిక) సూత్రాలు క్రతువులుగా, పూజా విధానాలుగా మారి సంస్కృతిగా చలామణి అవుతుంది. ఇక అప్పుడు అది ఆ తెగ (జాతి–సమూహం) సంస్కృతిగా ఆ కాలంలో స్థిరపడుతుంది. వ్యక్తం చేసే ఆలోచనలు, సంజ్ఞలు భాషగా అవతరిస్తుంది.

ఈ సాంస్కృతిక పరిణామంలో నిత్య జీవితంలో ఆలోచనలు, భావాలు సింహభాగం ఆక్రమిస్తున్న విషయం కాదనలేని సత్యం.

అయితే ఆకలి తీరని అన్నార్తులకు, గర్భదరిద్రులకు, బాధితులకు బానిసలకు, స్వేచ్ఛాయుతమైన కనీస అవసరాలు తీరే ఆరోగ్యకరమైన బ్రతుకు చుట్టుతానే ఆలోచనలు పరిభ్రమిస్తూంటాయి.

ఇప్పటికీ కోట్లాదిమంది అడవి బిడ్డలకు (ఆదివాసులకు) నగర జీవనంతోగాని, రాజ్యంతో గాని పెద్దగా సంబంధం ఉండదు. అందుకే ఇలా పాడుకుంటారు.

అడవి తల్లికి దండాలో / మా తల్లి అడవికి దండాలో..

అడవి చల్లంగుంటే అన్నానికి లోటే లేదు

పంటలు ఇంటికి వస్తే... పండుగ జేసుకుంటాము.

ఇందులో జీవన సత్యం ఉంది. కాలానుగుణంగా ప్రకృతి శోభిల్లితే, వారి బ్రతుకులూ పరిఢవిల్లుతాయి. ఆరోగ్యానికి ఆనందానికి కాదనే ఉండదు.

ప్రకృతి చల్లంగా ఉండాలనే భావన. చల్లంగా ఉంటేనే మానమూ చల్లంగా ఉంటామనే సత్యంతో కూడిన ఓ మానవీయ సార్వత్రిక భావన ఇది.

ఆఫ్రికా అడవుల్లో ఆదివాసికి ఎవరైన ఓ అపరిచితవ్యక్తి కనిపిస్తే చిరునవ్వుతో ముందుగా... నేనున్నాను నీకు తోడుగా (ఉబంటూ) అని అంటారు. అంటే అతని

రక్షణ బాధ్యత ఈ ఆదివాసి తీసుకుంటున్నట్టు అర్థం. మనం అనుకునే 'బావున్నారా...!' అనే చిన్న పలకరింపువంటిది ఇది.

అయితే ఇందులో మనిషిని మనిషి పట్టించుకునే తత్వం మనిషికోసం మనిషి నిలబడాలనే మనిషితనం అన్నీ గోచరమవుతాయి.

మరి ఈ ఆదివాసుల (మూలవాసుల) సంస్కృతి మనకు ఏం పాఠం నేర్పుతుంది. ప్రకృతిని కాపాడుకోవాలని, మనిషిని పట్టించుకోవాలని చెప్తుంది.

కాగా, మరో ప్రక్క మనిషిలో వికృత స్వార్థం మొలుస్తూనే ఉన్నది. దోపిడి, పీడన పద్ధతులను మార్చుకుంటూ మానవజాతిని బలి తీసుకుంటూనే ఉన్నది. ప్రకృతిని ధ్వంసం చేయడం, యుద్ధాలు, మారణహోమాలు సృష్టించి మానవ హననానికి పాల్పడటం మనం గమనిస్తూనే ఉన్నాము.

భూములకోసం, దేశాలకోసం, ఆధిపత్యం కోసం, లాభాలకోసం యుద్ధాలు జరుగుతూనే ఉన్నాయి. ప్రజలు, కష్టజీవులు ప్రత్యక్షంగా పరోక్షంగా ఆ బాధలను అనుభవిస్తూనే ఉన్నారు.

అయితే ఇందుకు ప్రతిగా రెండో ప్రక్క మనిషి (బానిస బాధితుడు) తన విముక్తి కోసం, రక్షణకోసం, హక్కులకోసం సంఘటిత సమరశీల పోరాటాలు చేస్తూనే ఉన్నాడు.

మనుషులందరూ సమానమే. ఎవరూ ఎక్కువకాదు. ఎవరూ తక్కువ కాదు అని గొంతెత్తి దిక్కులు పిక్కటిల్లేటట్టు నినదిస్తున్నాడు. స్థూలంగా చూస్తే... ఘర్షణ ఇక్కడే కేంద్రీకృతం అయినట్టు కన్పిస్తుంది. ఒక మనిషి ఆధిపత్యం, ఆక్రమణ, వ్యక్తిగతస్వార్థం వైపు నిలబడితే అందుకు ప్రతిగా మరో మనిషి మానవజాతి విముక్తి రక్షణ, సమానత్వం కోసం నిలబడుతున్నాడు.

అనాదిగా భావజాల ఘర్షణలు పెద్ద ఎత్తున జరుగుతున్నప్పటికీ 19వ శతాబ్దం ద్వితీయార్థంలో సంభవించిన మేడే చారిత్రక పోరాటం మనిషి జీవనానికి ఒక అర్థాన్ని ఇవ్వడానికి ప్రయత్నించింది. భావవాదపరమైన తాత్విక దృక్పథాన్ని బ్రద్దలు కొట్టింది. క్రియాశీలత లేని ఆధ్యాత్మిక మెట్టవేదాంతాలను తుత్తునియలు చేసింది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ వాదాన్ని పూర్తిగా పూర్వపక్షం చేసింది.

మనిషి బానిస కాదు. పశువు అంతకన్నా కాదు. గొడ్డులా చాకిరి చేయడానికి. రోజుకు ఎనిమిది గంటలు మాత్రమే పనిచేస్తాడు. ఎనిమిది గంటలు నిద్ర. మరో ఎనిమిది గంటలు బంధుమిత్రులతో, పిల్లలతో సంతోషంగా గడపాలి. అలా తనదైన జీవన ప్రస్థానం నిర్మించుకున్నాడు. తన సొంత (భావనా, మానసిక) ప్రపంచంలో స్వేచ్ఛగా విహరించడానికి మార్గాన్ని సుగమం చేసుకున్నాడు. మానవ వికాసానికి బాటలు పరుచుకున్నాడు.

మనిషి యంత్రాలకు, పరిశ్రమలకు వ్యతిరేకం కాదు. మనిషి యాంత్రీకరణ కావడానికి వ్యతిరేకం అని స్పష్టంగా తెలుసుకున్నాడు. స్వేచ్ఛగా, సంతోషంగా ఉంటేనే ఉత్సాహంగా పనిచేస్తాడు. ఉత్పాదకశక్తిని పెంచుకోగలడు అని రుజువు చేశాడు.

ఆధునిక వ్యవస్థలు, రాజ్యాలు ఇలాంటి స్నేహపూర్వక వాతావరణం సృష్టించడానికి నడుం కట్టాలి. ప్రజలు ఆనందంగా భాగం పంచుకునే ప్రజాస్వామ్యం అంటే ఇదే... అని తేల్చి చెప్పాడు.

ఆధునిక తాత్విక లక్ష్యం ఇప్పుడు పూర్తిగా మారిపోయింది. దైవం స్థానంలో మానవుడు అవతరించాడు. కళా సాహిత్యాలకు మనిషే కేంద్ర బిందువయ్యాడు.

'స్వార్థంతో ఎవడి లాభం వాడు చూసుకోవడం, పెత్తనం చెలాయించడం అనేది నిన్నటి నీతి. అది బాగా గబ్బుపట్టి కుళ్ళి కంపువాసన కొడుతుంది. శాంతి – సమభావం – సమిష్టి క్షేమం అనేది నేటి (ఆధునిక) నీతి. కవులు, కళాకారులు, రచయితలు ఈ ఆధునిక నీతిని పాదుకొల్పేందుకు పాటుపడాలి' అని మహాకవి శ్రీశ్రీ 70 ఏళ్ళ క్రితమే పిలుపు యిచ్చాడు. ఆ మార్గంలో నడిచి మార్గదర్శకుడయ్యాడు.

అభ్యుదయ కళాకారులకు, సాంస్కృతిక ఉద్యమ కార్యకర్తలకు, ప్రజాస్వామ్య వాదులకు, కమ్యూనిస్టులకు విశ్వమానవ దృక్పథం అలవడింది. శిరోధార్యమైంది.

విశ్వంలో ఎక్కడ పుట్టినా, పెరిగినా, మనుషులందరూ సమానమే. జాతి, మతం, కులం, వర్ణం, ప్రాంతం, లింగం, భాషా మొదలగు వైషమ్యాలు అస్సలు ఉండకూడదు. వీటికి అతీతంగా మానవీయంగా వ్యవహరించాలి. స్వార్థపూరిత సంకుచిత చట్రాల్లో బంధీ కాకూడదు.

భావజాలంగా ముందుతాను (కళాకారుడు / కార్యకర్త) విముక్తి అయితేనే ప్రజలను సకల వివక్షతలనుండి విముక్తి చేసే మహాప్రస్థానంలోకి ప్రవేశించగలడు.

అలాగాని పక్షంలో ఏదో ఒక దుందుడుకుతనానికి, ఉన్మాదానికి వివేచన, పునరాలోచన లేని మూర్ఖత్వానికి లోనయ్యే ప్రమాదం ఉంటుంది. ప్రజాస్వామ్య యుతంగా వ్యవహరించలేడు.

భౌతిక ప్రపంచంలో మార్పు తీసుకు రావాల్సినవారు ముందుగా భావజాలంలో మార్పు తీసుకువచ్చేందుకు ఘర్షణ పడాలి. ఈ ఘర్షణ తనలో ఉండాలి. బయటా ఉండాలి.

రోజురోజుకి సంక్లిష్టమవుతున్న ఈ ప్రాపంచిక సమాజంలో ఎవరు ఎలా అడుగిడుతున్నారు. ప్రజల్ని దోపిడితో, పీడనతో, యుద్ధాలతో, మారణ హోమాలతో, హింసతో అగాధంలో నెడుతున్నది ఎవరు?

ప్రజల హక్కుల్ని గౌరవిస్తూ, అందరూ సమానమనే ప్రజాస్వామ్య భావాలతో బాధితులకు రక్షణ కల్పిస్తున్నది ఎవరు?

స్థూలంగా చూడాలి. సూక్ష్మంగా చూడాలి. తనలో కూడా చూసుకోవాలి. (ఆత్మ విమర్శ) లోపాలుంటే సరిచేసుకోవాలి. చెప్పేదానికి చేసేదానికి వైరుధ్యం ఉండకూడదు. అప్పుడే ప్రజలతో కలిసి మెలిసి పనిచేసే ఉన్నత ప్రజాస్వామిక వాతావరణం నెలకొంటుంది. సాంస్కృతిక వాతావరణం అనేది ప్రజల దైనందిన అలవాటుగా మారాలి. ఆ దిశగా మన ఆలోచన ఆచరణ ఉండాలి.

* * *

# 4. కళలు – కలలు – మనకు అవసరమున్నాయా?

- సి.ఎ. ప్రసాద్, ప్రజా సైన్స్ వేదిక, సింగరాయకొండ

ఒక కవి మిత్రుడు ఇటీవల ఒక పాట రాశారు. అందులోని కొన్ని వాక్యాలు–

ఆలోచనల అనంత శక్తితో – అంతరిక్షమును ఛేదించి –
పక్షిలాగ రెక్కలను సాచి – ఆ నక్షత్రాలను శోధించి –
కలలను కనడం నేర్పి కళలో – కళాకాంతులను నింపడం –
మండే ప్రశ్నల బృందగానమై – తరతరాల సంకెళ్ళు తెంచడం....

ఇంకా : ఎడద పువ్వులా విచ్చుకుని – మెదడు వాకిళ్ళ తలుపు తెరవడం

చిట్టి చేతులతో మట్టిముఖాన – ఆకుపచ్చని కలలు అద్దడం...

అని చెప్తారు. ఆయన పేరు గంటేడ గౌరునాయుడు.

ఎందుకని ఈ పదాలు గుర్తు చేసుకోవలసి వచ్చిందో...

ఆ నేపథ్యంలోకి కూడా కొన్ని అడుగులు వేసి చూద్దామా?

విద్యాతత్వశాస్త్రం – చదువులు, నేర్చుకోవడం గురించి వివరిస్తూ విద్యకు రెండు ముఖాలుంటాయని, విద్య దేనికోసం అని ప్రశ్నలేస్తే –

1) జీవితంలో సామాజికంగా, ఆర్థికంగా కూడా ఒక స్థాయిలో ఉండటం కోసం – చదువులు అని,

2) మనచుట్టూ ఉన్న సమాజాన్ని, చరిత్రను, సంస్కృతిని అర్థం చేసుకునే శక్తి సామర్థ్యాలు, జ్ఞానం – చదువుల ద్వారా మనం సాధించగలమని చెప్తారు.

ఈ రెండు అంశాలు విడివిడిగా కనిపించినా, అనిపించినా – రెంటికీ ఒక అవినాభావ సంబంధం ఉన్నది. చదువంటే పుస్తకాల బస్తాల మోత కానేకాదు, చదువంటే మార్కులు, ర్యాంకులు, ఈ గందరగోళం కూడా కాదు కదా! మనల్ని మనం అర్థం చేసుకోవడం, మన చుట్టూ ఉన్న సమాజాన్ని, ప్రపంచాన్ని అర్థం చేసుకోవడం, జరుగుతోన్న సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక మార్పులను నిజంగా పరిశీలనగా చూస్తూ అడుగులు వేయడాన్ని నేర్పించేది చదువే కదా! అదే కదా చదువు అంటే, ఆకాశమే హద్దుగా ప్రతిక్షణం కొత్త అనుభవాలను సంపాదించు కోవడమే చదువుల లక్ష్యం. ఆ విధమైన అనుభవాలు, పని, పాటలు, జనం గురించిన అసలైన చరిత్ర మనం అర్థం చేసుకోవడం కోసమే కళలు, మనిషి పుట్టినపుడే,

చుట్టూ చూడడం, పరిశీలించడం, అడగడం నేర్చుకున్నప్పుడే కళలు కూడా మొదలైనాయి కదా! లయబద్ధంగా పిలవడం / పలకడం / పాడటం / అడుగులు వేయడం / పనిచేయడం – ప్రతి పనిలోనూ, ఆ పనితో పాటుగా ఒక కళ కూడా ఉంటుంది, ఉండాలి కూడా, అప్పుడే కదా ఆ పని అనుభవంలోని అందాలు మనకు అర్థమయేది.

పాటపాడడం, రాగం తీయడం, బొమ్మలు గీయడం, రంగులు కలపడం, వేయడం, అడుగులు వేయడం, ఒక దరువు– (డప్పు వంటి వాయిద్యాలు సహకారంతో) ఆధారంగా చిందులు వేయడం – ఇవన్నీ ఆదిమ మానవుని కాలం నుండి ఆధునిక మానవుల జీవితం దాకా మనతో ప్రయాణం చేస్తూనే ఉన్నాయి. కాకపోతే రూపాలు మాత్రం మారుతూ ఉంటాయి. సహజమే కదా!

మనం ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితికి ప్రయాణం చేయడానికి అనువైన సాధనాలు కూడా కళలే, వినడం, మాట్లాడటం కూడా ఒక కళగా / పని నైపుణ్యంగా మారుతోన్న రోజుల్లో మనమున్నాం.

ఒకనాడు పని చేస్తూనో, పొలంలో నాట్లు వేస్తూనో, మరో సందర్భంలోనో అందరూ కలిసి పాట అందుకుని ఆ పాటను వాళ్ళందరే కలిసి పొడిగిస్తూ పాడుకుంటూ కలిసి పనిచేస్తూ ఆ పనిలో ఉన్న అలసటను కొంచెం తగ్గించుకుని ఉత్సాహం పెంచుకునే వాళ్ళు, అనేక సందర్భాల్లో, ఆ సందర్భాలకు తగిన పాటలు పల్లెజనం కల్పించుకునేవాళ్ళు, అందుకనే వాటిని జానపద గేయాలన్నాం. ఈ రోజున పని పద్ధతి మారింది, మనుషుల బదులు యంత్రాలు రాజ్యమేలుతున్న రోజుల్లో మనమున్నాం. కానీ, ఈనాటికీ జానపదం తన రూపు మార్చుకుని అనేక ప్రజా ఉద్యమాలకు ఊపిరిగా నిలబడుతూనే ఉన్నది కదా! ఇంకొంచెం తన స్టైల్ మార్చుకుని ఈనాటి యువతరం కూడా జానపదాలను మార్చుకుని పాడుకుంటూనే ఉన్నారు.

ఒకప్పుడు తీరికగా కూర్చుని కథలు చెప్పుకునేవాళ్ళు. పిల్లలకు కూడా పెద్దవాళ్ళు అనేక కథలు వినిపించేవాళ్ళు, ఆ కథా రూపాలు మారి బొమ్మలాటలు, తోలు బొమ్మలాటలుగా, మరెన్నో రూపాలు మార్చుకున్నా ఈనాటికీ కథ అనేది సజీవంగా ఉన్న ఒక కళారూపమే కదా! పంచతంత్ర కథలు ఏనాటి లోకం? ఇప్పటి పోటీ ప్రపంచంలో విజయాలు సాధించడానికి వ్యక్తిత్వ వికాసం / (పర్సనాలిటీ డెవలప్‌మెంట్) తరగతుల్లో భాగంగా ఆనాటి కథల రూపురేఖలు మార్చి చాలా ఖరీదైన కథలుగా యిప్పుడు కూడా అందుబాటులో ఉన్నాయి. కథలు చెప్పడంలో

అనేక విధాలైన ప్రత్యామ్నాయ విధానాలు నేర్చుకున్న ఎందరో యువతరం మిత్రులు తమ జీవనోపాధిగా మార్చుకుంటున్న రోజుల్లో మనమున్నాం. "కాదేదీ కవిత కనర్హం" అని శ్రీశ్రీ ఆనాడు చెప్పడం గుర్తుంది కదా? కాదేదీ బ్రతకడానికనర్హం – అని ఈ రోజున చెప్పవచ్చును. ఆటలు, పాటలు, మేజిక్, ఆఖరుకు జానపదాలు, మరెన్నో ఒకనాడు శరీరం, మనసు ఆనందంగా ఉండటానికి అవసరం అని నమ్మేవాళ్ళం. మరి ఈ రోజున అవన్నీ వ్యాపార వస్తువులుగా, జీవన పోరాటంలో వస్తువులుగా మారిపోతున్న రోజుల్లో మనమున్నాం. అంటే సహజంగా ఉండాల్సిన మన కలలు, కళలు అన్నీ రూపాలు పోగొట్టుకుని వినిమయతత్వంలో భాగంగా మారుతున్నాయి. అంటే జనం మానసిక సహజ సంపదలుగా ఉండాల్సిన కళలు, జానపద రూపాలు అన్నీ బ్రతుకు పోరాటంలో పడి, పేదవాళ్ళకు, పిల్లలకు దూరమై పెద్దవాళ్ళ దగ్గర, సినిమాల్లో, క్లబ్బుల్లో, టివి. షోలలో ఆట బొమ్మలుగా మారినాయి. విచిత్రం, విషాదం ఏమిటంటే ఈ మారుతున్న కళారూపాల ప్రభావం (అంటే ఈనాటి సినిమాలు, టి.వి. షోలు, యిటీవల వస్తోన్న సెక్స్, క్రైమ్, ద్వంద్వార్థాల పాటలు) ఈనాటి యువతరం మీద, అంతకంటే ముఖ్యంగా చిన్న పిల్లలమీద చాలా ఎక్కువగా ఉన్నదనే నిజం మనకు అర్థం కావాల్సి ఉంది.

కలలు కనడం, కళాత్మకంగా జీవితానికి అవసరమైన చదువులు నేర్చుకోవలసిన చిన్నారులు ఈనాటి టివి, కంప్యూటర్, సినిమా హీరోల, హీరోయిన్ల చెత్త కళల ప్రభావానికి లోనై మానసిక బలహీనతకు లోనవడం, చిన్న వయసులలోనే, చిన్న చదువుల సమయంలోనే చదువుకన్నా, బ్రతుకుకన్నా, మంచి ఆలోచనలకు కూడా దూరమై నేరగాళ్ళుగా, చరిత్రహీనులుగా మారుతున్నారు అనే వాస్తవం అర్థమైతేనే కళల ప్రభావం, చరిత్రను సరిగ్గా అర్థం చేసుకోవలసిన అవసరం ఈనాటి పెద్దవాళ్ళకు అర్థమయే అవకాశం ఉంటుందని నేను నమ్ముతున్నాను. సోకాల్డ్ భక్తి ముసుగులో కొన్ని శక్తులు, కాలక్షేపం ముసుగులో కొన్ని శక్తులు మన జీవితాలను, ముఖ్యంగా భవిష్యత్ తరాలను పూర్తిగా నాశనం చేయకముందుగానే సామాజిక కార్యకర్తలు, నిజమైన దేశభక్తులు, శాస్త్రీయంగా ఆలోచించగలిగిన వ్యక్తులు, శక్తులు మళ్ళీ ప్రజా కళల జోలికి వెళ్ళడం చాలా అవసరం. చిన్న పిల్లలకు అవసరమైన కళారూపాలు, కథలు, దగ్గరి నుండి యుక్తవయసులోని చిన్నారులకు అవసరమైన ధైర్యాన్ని అందించగలిగిన చరిత్రలు మన జీవితంలో, ముఖ్యంగా చదువుల్లో భాగం కావలసి వుంది. ఊరికే మాట్లాడితే లాభం లేదు, పని చేయాలి, ఉపన్యాసాలు పనిచేయవు, నిజమైన పని విధానం చాలా అవసరం. అప్పుడే కలలు – కళలు మళ్ళీ మన జీవితాలలో భాగం అవుతాయి.

* * *

# 5. ప్రత్యామ్నాయ చిత్రకళ కనుమరుగౌతున్నది..

## కాపాడుకుందాం.. బతికించుకుందాం.. భావితరాలకు అందిద్దాం...

–శ్రీను, ప్రధాన కార్యదర్శి, చిత్రకారులు & పెయింటింగ్ వర్కర్స్ యూనియన్
ఆంధ్రప్రదేశ్ & తెలంగాణ (పి.కె.యస్. అనుబంధము), ప్రొద్దుటూరు.

కళాకారుడి కుంచె చేసే విన్యాసం.. వెలుగవుతుంది.. చీకటవుతుంది... వ్యాపారం చేయిస్తుంది... కొనిపిస్తుంది.. మేల్కొలుపుతుంది.. పెట్టుబడిదారుల జేబులు నింపుతుంది... ప్రభుత్వాల ప్రచారాలను హోరెత్తిస్తుంది. ప్రపంచమంతా నీ రంగుల్నే చూస్తుంది. ఎల్లప్పుడు సామాజిక చైతన్యమే... ఉదయిస్తున్న సూర్యుడిలా నీ మోములో ఎప్పుడూ చిరునవ్వులే.

ఓ చిత్రమంటే రంగురేఖల పొందికే కాదు, అందమైన భవంతుల అలంకరణ అసలేకాదు.. అది యుద్ధభూమిలో ఒక ఆయుధం.. మతోన్మాదులకు శాంతిని బోధించే ఓ సందేశం.. చిత్రం అంటే మనిషికి మనిషిపైగల ప్రేమ కూడా, తనలోని భావాలు, ఆవేశం, బాధ, కన్నీళ్లే క్యాన్వాస్‌పై చిత్రం. చిత్రమంటే తరతరాల మన చరిత్రను ప్రత్యక్షం చేయటం. అలాంటి కళ నేడు పెట్టుబడిదారులు గుప్పెట్లో బంధీ అయింది. వ్యాపారస్తుల జేబులు నింపడానికి కళ బంధీ అవుతోంది, కానీ కొన్ని కుంచెలు బంధిఖానాకు వ్యతిరేకంగా రంగుల సీతాకోకచిలుకలైనచోట చిత్రం సమాజహితమైంది. కళ కళ కోసం కాదు, ప్రజల కోసం. సామాజిక ప్రయోజనం కోసం... అంటున్న చిత్రకారులు చరిత్రలో సుస్థిరస్థానం సంపాదించారు. ప్రజలకు ఉపయోగపడని కళ కాలగర్భంలో కలిసిపోయింది... పోతుంది.

కళాకారులు విశ్వప్రేమికులు.. ప్రపంచం కోసం.. దేశం కోసం.. రాష్ట్రం కోసం.. తమ ప్రాంతం కోసం.. చుట్టూ ఉన్న సమాజం కోసం అంకితమై తనుమాత్రం ఆకలితో సహజీవనం చేస్తున్నాడు. మానవజాతి అభివృద్ధిలో వీరికృషి ఎంతో ఉంది. మానవజాతి నాగరికత నేర్వని రోజుల్లో లిపి పుట్టకముందే చిత్రకళ పుట్టింది. చిత్రాలకు సంకేతాలుగా ఉపయోగించుకున్న సంఘటనలు మనకు గుహల్లో దర్శనమిచ్చాయి. తర్వాత కాలంలో తమ తమ మతాలకు సంబంధించిన ముఖ్య సంఘటనలను కళాకారులు తమ చిత్రాలకు వస్తువులుగా తీసుకొన్నారు. తర్వాత కాలంలో వివిధ దేశాల పాలకులు తమ కుటుంబ సభ్యుల రూపచిత్రాల్ని చిత్రింపచేసుకొని భద్రపర్చుకున్నారు. మన దేశంలో బ్రిటీష్ వారి పాలన సందర్భంగా

కూడా రూప చిత్రాలకు ప్రాధాన్యత ఇచ్చారు. 20వ శతాబ్దంలో రాజా రవివర్మ ప్రవేశంతో రూపచిత్రాలతో పాటు, ఇతిహాసాలు, పురాణాల్లో ముఖ్య సంఘటనలను, దేవతల రూపాలను చిత్రీకరించడం ప్రారంభం అయింది. మనం స్వాతంత్ర్యం పొందాక పౌరాణిక చిత్రాలతో పాటు, ప్రకృతిలోని సుందర రమణీయ దృశ్యాల్ని చిత్రించి, కళాకారులు సమాజ చైతన్యానికి కృషిచేశారు.

ఇది కళకు ఒక రూపమైతే... మరోవైపు...

కళ తమ స్వార్థం కోసం కాకుండా.. సమాజహితం కోసం సామాజిక సమస్యల్ని, కష్టనష్టాల్ని, ప్రశ్నించేతత్వాన్ని, యుద్ధోన్మాదాన్ని, మతోన్మాదాన్ని, హక్కుల పోరాట.. ఆరాటాల ప్రత్యామ్నాయ చిత్రాల చరిత్రలో కొందరిని స్మరించుకోవడం మన బాధ్యతగా భావించి.. ఈ నాలుగు మాటలను మీతో పంచుకుంటున్నాను.

వేవేల వర్ణాలను కళ్లు పొడిచే ఒకే ఒక తెల్ల పిచ్చి కమ్ముకుని నీకూ నాకూ మధ్య వెలిబూడిదను మిగిల్చిన చోట, ఇంకా ఎందుకోయ్ తటపటాయింపు.. లెయ్.. కదులు.. ఉరుకు... ఎర్రెర్రని ముద్ద మందారపు ట్రయాగిల్వై.. వాడివేడి మొనవై.. ఎటాక్ ద వైట్స్. / రష్యన్ కళాకారుడు Lazar Markovich Lissitzky బోల్షివిక్కు యోధులు.. కమ్యూనిస్టుల శత్రువులైన వైట్ గార్డు మూకలతో పోరాడుతున్నప్పుడు Beat the Whites with the Red Wedge పేరుతో కన్స్ట్రక్టివిజం, సూపర్మాటిజిజమ్ శైలిలో వేసిన బొమ్మ. సింపుల్ జామెట్రీ ఫామ్స్‌తో ఇది ఆనాడు జనాన్ని ఊర్రూతలూగించింది. (ఇప్పుడు.. మనగడ్డపైనా అంతర్యుద్ధం సాగుతోంది.. కాషాయపు వెలిబూడిద మనుషుల మధ్య దూరాన్ని పెంచుతోంది. ఇప్పుడు.. పోరాటాల అరుణం.. మూలవాసుల నలుపు.. అంబేద్కర్ నీలం.. మరెన్నో వర్ణాలు కలసి పలుమొనల ఆయుధమై జాతిమతోన్మాద శాఫ్రాన్స్‌పై దాడి చేయాలి..)

పికాసో వేసిన ప్రఖ్యాత 'గుయెర్నికా' (1937) పెయింటింగులోని గుర్రం గురించి చెప్పుకోవాలి.. "గుయెర్నికాలోని గుర్రం స్పెయిన్ బాధిత జనావళికి, ఎద్దు యుద్ధ క్రూరత్వానికి ప్రతీక అన్నాడు పికాసో.. ఈ గుర్రాన్ని, ఎడమవైపు పడిపోయిన సైనికుణ్ని, ఆ తల్లిని స్పెయిన్ రిపబ్లిక్ కు ప్రతీకలుగా, ఎద్దును నాజీల క్రూరత్వానికి గుర్తుగా భావించడం సమంజసంగా ఉంటుంది." కళాకారుడు ప్రజలవైపు నిలబడాలి అని చెప్పిన గొప్ప చిత్రం "గుయెర్నికా" **(ఆనాటి కన్నా ఇప్పుడు దేశం మరింత నెత్తురోడుతున్న ఒక గుయెర్నికా)**

"ప్రాణప్రదంగా పెంచుకున్న బిడ్డల్ని ఫిరంగి గుళ్లకు ఆహుతిచ్చి తాము వీరమాతలమని గర్వించే మహాతల్లులు ఏ దేశంలో వున్నారో చెప్పండి...." - జర్మన్ ప్రజాచిత్రకారణి కెథే కోల్విజ్ (1918) దేశం కోసం మీ పిల్లలను బలివ్వండంటూ ఒక జాతీయవాద ఉన్మాది ఇచ్చిన పిలుపుకు కోల్విజ్ ప్రతిస్పందన ఇది. కోల్విజ్ చిన్న కొడుకు మొదటి ప్రపంచ యుద్ధంలో చనిపోయాడు. మనవడు రెండో ప్రపంచయుద్ధంలో చనిపోయాడు. రెండు కడుపుకోతల దుఃఖం ఆమెది... **(నేడూ బలిదానాలు కొనసాగుతున్నాయి)**

రష్యన్ రియలిస్టు చిత్రకారుడు వాసిలీ పెరోవ్ (1834-1882) 'అంతిమ యాత్ర' పేరుతో 1865లో వేసిన బొమ్మను చూశాక. పూష్కిన్‌కు సరితూగే రష్యన్ కవి నికోలాయ్ నెక్రాసోవ్ రాసిన 'The red Nose Frost' (1863) కావ్యం ఈ వర్ణవిషాదానికి స్ఫూర్తి. ఆ కావ్యంలో ఒక యువరైతు అకాల మరణం, ఆ మరణం తర్వాత అడవిలో అతని భార్య బతుకుపోరాటం ఉంది. **(నేడు వలస కార్మికులు రోడ్లవెంట వేలకిలోమీటర్లు నడుస్తూ దారిలో మరణించిన తమ వారి శవాల్ని వదిలేసి సొంతూరుకు వెళుతున్న దృశ్యాలు కదలాడుతున్నాయి.)**

అర్తిమిజాయా జెంతిలిస్కి (1593-1656) ప్రఖ్యాత ఇటాలియన్ చిత్రకారిణి. ఆమె జీవితం ఒక హర్రర్, టార్చర్, సైకలాజిక్ సినిమా. తండ్రి ఒరాజియా వద్ద బొమ్మలు నేర్చుకుంది, ఆ కాలం ఆడపిల్లలకు భిన్నంగా. తండ్రి స్నేహితుడు తాసి ఆమెను 18 ఏట రేప్ చేశాడు. ఆక్రోశించింది. చాటుగా ఉన్న పనిమనిషి ఏమి జరగనట్లు పట్టించుకోలేదు. ఆ రోగ్ తాసి... రేప్ చేశాగా, ఇక పెళ్లాడతానన్నాడు. అర్తిమిజియా నమ్మి వాడికి లొంగిపోయింది. వాడు మాట మార్చాడు, వాడికి అప్పటికే పెళ్లయి, పిల్లలున్నారు. ఒరాజియో తన కూతురి బతుక్కోసం కోర్టుకెక్కాడు. అక్కడ రేప్‌కు మించిన నరకం పాలైంది అర్తిమిజియా. ఆమెను దారుణంగా హింసలు పెట్టి కన్యత్వ పరీక్ష చేశారు, సూటిపోటి మాటలతో వేధించారు. సిగ్గుతో చచ్చిపోయింది. మొత్తానికి తాసి దోషిగా తేలాడు, శిక్ష పడింది కానీ, నేటి రేపిస్టుల్లా, కండల హీరోల్లా శిక్ష అనుభవించలేదు. అర్తిమిజియా తర్వాత మరో అర్టిస్టును పెళ్లాడి.... తన బొమ్మలతో గొప్ప పేరు తెచ్చుకుంది. అయితే ఆ రేప్, కోర్టు విచారణ ఆమెను జీవితాంతం రక్కసి క్రీనీడల్లా వెంటాడాయి. ఆ నీడల గోళ్ల కింద ఆమె అనేక అద్భుత చిత్రాలు వేసింది. ఆమె చిత్రాలు అతివలపై దురాగతాలకు పాల్పడే మగపురుగులను తన కేన్వాసులో బంధించి పరపరా గొంతులు కోసింది. ఆ

తలకాయలను తన దాసి తలపై తట్టలో పెట్టి వెంట తీసుకెళ్లింది. ఆ బొమ్మల్లో గొంతులు కోస్తున్నది అర్తిమిజియానే... అంటే సెల్ఫ్ పోర్ట్రేట్ అన్నమాట. ఆమెపై బోలెడు నవలలు, సినిమాలు వచ్చాయి. **(రేప్ చేసిన మగాడి తల కోసి పనమ్మాయి తట్టలో పెట్టిన బొమ్మన్ని పెద్దపెద్ద హోర్డింగ్స్ మీద వేయించి నగరాల్లో ప్రముఖంగా ప్రధాన కూడళ్లలో పెట్టిస్తే రేప్ కేసులు, ఆడవారిని వేధించే కేసులు ఓ 10 శాతం అన్న తగ్గుతాయేమో.. నేటికీ ఇలాంటి సంఘటనలు కోర్టుల్లో కొనసాగుతూనే ఉన్నాయి..)**

కడుపు నిండక మండే కన్నీళ్ళతో ఎర్రజెండాకు సుత్తి కొడవలి రంగులద్దిన వాడూ విప్లవకారుడే..! కొంతమంది కడుపునిండిన కళాకారులకు ఎర్రజెండా.. ప్రత్యామ్నాయ కళ అనే పదాలు నచ్చకపోవచ్చు. హేళనగా అనిపించొచ్చు. కానీ చరిత్ర వీళ్ళ నిర్వచనాలు, ఇష్టాయిష్టాలను బట్టి సాగదు. అది నిరంతరం ప్రత్యామ్నాయం వైపే కదులుతూ ఉంటుంది. దానికి అడ్డుపడేవాల్లు ఇప్పుడు మహోన్నత మేధావులుగా, తాత్విక కళాకారులుగా ప్రసిద్ధికెక్కొచ్చు కానీ ముందుతరాలకు ఉత్తి దాసులుగానే మిగిలిపోతారు...! ఇది చరిత్ర చెప్పిన సత్యం.

బెంగాల్‌కు చెందిన చిత్తప్రసాద్, నిజాం నిరంకుశ పాలనపై ఎన్నో లినోకట్ చిత్రాలు వేసి, తెలంగాణా ప్రజల కష్టాల్ని కళ్ళకు కట్టినట్లు చూపించారు. 1950వ దశకంలో శ్రీకాకుళం జిల్లాలో విలయతాండవం చేసిన 'కరవు'పై, యుద్ధం పై అనేక చిత్రాలు గీసి, నిరుపేదల ఇక్కట్లను ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్ళారు. ఇలా ఎందరో కళాకారులు సాంఘిక సమస్యలైన వరకట్నం, బాల్యవివాహాలు, మంచినీటి సమస్య, ఆకలి, నిరుద్యోగం, అవినీతిని చిత్రాలుగా మలిచి, సమస్యల తీవ్రతను ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్ళగలిగారు.

అనంతపురం నుండి "కాకి కవి" బిరుదుతో కొనసాగిన ప్రజాకళాకారుడు కోగిర జయసీతారాం, ఆయన చిత్రకారుడు, కవి, ఉపాధ్యాయుడు "కాకి ప్రజల పక్షి. నిత్యము వాళ్ళను మేల్కొపుతూ వుంటుంది. నేనూ అటువంటి వాడినే. నాకు ఆ బిరుదు తగినదేనని సగౌరవంగా స్వీకరించాడు" కడప నుండి 1969 నుండి 2002 వరకూ జయదేవ్ అనేక సామాజిక వ్యంగ్య చిత్రాలను గీశారు. చలసాని ప్రసాదరావు సహవాసంతో ఏలే లక్ష్మణ్ గీతకార్మికులు నడుముకు కట్టుకునే పట్టి, లోట్లు పెట్టుకొని గౌడు పొలం వెంట నడుస్తుంటాడు గొల్లోల్ల బుచ్చయ్య తనదైన ఆహార్యంలో అందంగా కనిపిస్తాడు. ముసలవ్వ తన్మయంగా సుట్టతాగుతూ

కనిపిస్తుంది. ఇసుఁరాయి సంగీతం వినిపిస్తుంది. ఇలా తన ఊళ్లో ఎవరిని చూసినా, ఎక్కడ చూసినా కళే కనిపించింది. ఇక అది మొదలు తన కుంచె తన వేళ్లను తడమడం మొదలుపెట్టింది. ఎన్నో కళాత్మక చిత్రాలను గీశాడు అలా ఎందరో చిత్రకారులు చరిత్రలో తమ స్థానాన్ని పదిలం చేసుకున్నారు.

కలర్ ఫోటోగ్రఫి, ఫ్లెక్సీ, ఆధునికత సాంకేతికత ప్రజలకు అందుబాటులోకి వచ్చాక చిత్రకారులకి ఆదరణ కొరవడిన మాట నిజం. ప్రస్తుతం చిత్రకళ అపార్ట్‌మెంట్ గోడలపై అలంకరణకు పరిమితం అయింది. ఈ రంగంలో ఉపాధి, ఉద్యోగ అవకాశాలు ఆశాజనకంగా మాత్రం లేవు. ఇలాంటి స్థితిలో కొత్త సంవత్సరం 2020 వస్తూ కొత్త వ్యాధి 'కరోనా'ను తెచ్చింది. అనతికాలంలో ఇది ప్రపంచ సమస్యగా మారింది. ముందెన్నడు, కని–విని ఎరుగని సమస్య, కనుచూపుమేర పరిష్కారం కూడా కనిపించడం లేదు.

కరోనా వ్యాధి సోకనుందన్న భయంతో పాలకులు ప్రపంచ వ్యాప్తంగా లాక్‌డౌన్ ప్రకటించారు. దీంతో ప్రజలంతా ఇళ్ళకే పరిమితం కావాల్సి వచ్చింది. ఈ కష్టకాలంలో చిత్రకారులు & పెయింటర్‌లు ఆకలితో... ఆత్మగౌరవంతోనూ బతుకుతూనే నిర్భందంగా వచ్చిన ఈ విలువైన సమయాన్ని ప్రపంచ వ్యాప్తంగా నున్న కళాకారులు సద్వినియోగం చేసుకొంటున్నారు. తీరిక సమయాన్ని కళాసాధన వైపు మళ్ళించి, చిత్ర సృష్టికి కృషి చేశారు... చేస్తున్నారు. కళాకారులను కాపాడుకోవల్సిన బాధ్యత ప్రభుత్వాలపై ఉంది. లేకుంటే భవిష్యత్తులో చిత్రకళ కనుమరుగయ్యే పరిస్థితులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎన్ని కష్టాలున్నా చిత్రకళను కొనసాగిస్తున్న వారికి జేజేలు పలుకుదాం.

చిత్రకారులు మరియు పెయింటర్స్ తమ చిత్రాలు సామాన్యుల సమస్యలను ఎత్తిచూపుతూ విషయం అర్థమై, అందులోని అందాన్ని, నైపుణ్యతను, సృజనాత్మకతను ఆస్వాదించేలా ఉండాలని, నేటి తరానికి వారసత్వాన్ని అందించి... సామాజిక ప్రయోజనం కోసం కళాకారులు చిత్రకళను బతికించుకోవాలనే మా సంఘం ఆకాంక్షిస్తున్నది... ఆంధ్రప్రదేశ్ & తెలంగాణ రాష్ట్రాల్లో 40 లక్షల వరకు ఉన్న పెయింటింగ్ & చిత్రకళాకారులను తక్షణం ప్రభుత్వాలు ఆదుకోవాలి.

* * *

# 6. భారతీయ కళాప్రక్రియపై బౌద్ధం ప్రభావం

- పిల్లి రాంబాబు, బౌద్ధ పరిశోధన-అధ్యయనకేంద్రం, రామచంద్రపురం.

ప్రాచీన భారతదేశపు సంస్కృతి మొరటుతనాన్ని, అజ్ఞానాన్ని, అవిద్యను మిళితం చేసుకుని చాలాకాలం కొనసాగింది. ఇటువంటి సంస్కృతిలో సమాజ వికాసం గానీ సంస్కృతీ వికాసం గాని లేనేలేవు. ఆదిమజాతులు, చార్వాకులు, సాంఖ్యులు కొంత తాత్విక భావజాలాన్ని ప్రవహింపచేసారనుటలో సందేహం లేదు కాని అది పూర్తిస్థాయిలో మానవ వికాసానికి దోహదం చేయలేకపోయింది. తదనంతర కాలంలో వచ్చిన బౌద్ధధర్మం అంతకు ముందు కాలంలోని సంస్కృతి తనలో ఇముడ్చుకుని కొత్తపుంతలు తొక్కింది. భాష, సంస్కృతి, ఆచార సాంప్రదాయాలకు మొరటుతనం పోటు, వాటికి సృజనాత్మకత, సాధికారత సమకూర్చినది బౌద్ధయుగంలోనే. ఇందుకు బౌద్ధం ప్రేరణగా నిలిచింది. సాహిత్యం, కళలు, సంగీతం, శిల్పం, నాట్యం, చిత్రకళ, నాటకం, గానం వంటి అనేక రంగాలతోపాటు, విశ్వవిద్యాలయాల ఏర్పాటు, క్రీడలు, మార్షల్ ఆర్ట్స్, వ్యవసాయం, వ్యాపారం, నౌకాయానం, రాజ్యపాలన, విదేశీ వ్యవహారాలు, చేతివృత్తులు ఇలా ఎన్నింటికో బౌద్ధం మాతృభూమిక. పలానా రంగంలో మాత్రమే బౌద్ధం తన ప్రభావాన్ని చూపిందనడానికి వీలులేకుండా సమస్త రంగాలను అది స్పృశించినది. అన్నింటికి అది ఆయువుగా, ప్రేరణగా నిలిచింది.

అంధకులు (ఆంధ్రులు) అంటే అనాగరికులుగా, బాహ్య ప్రపంచంలో సహన సంస్కారాలు లేని పౌరులుగా భావించిన / చిత్రీకరించిన దౌర్బల్యాన్ని బౌద్ధం పటాపంచలు చేసింది. మానవుడు సర్వశక్తి సంపన్నుడుగా విశ్వమంతటా ఎదగడానికి ఎటుచూసినా బౌద్ధమొక్కటే ప్రత్యక్ష కారణమయింది. కాలక్రమంలో బౌద్ధాన్ని నాశనం చేసిన వైదికం దాని ఆచారాలు మానవుడిని అధః పాతాళానికి తొక్కి సర్వహీనుడుగా దిగజార్చాయి. ఈ వైదికాచారాలే పైన తెలిపిన రంగాలలో ప్రవేశించి వాటిని దుర్గంధపూరితం చేసాయి. సాహిత్యం మొదలుకుని చేతివృత్తుల వరకు అన్నింటిని తమవిగా ప్రచారం చేసుకున్నది. దురదృష్టవశాత్తు ఈ రంగాల పుట్టుక, ఔన్నత్యాలు ఎక్కడివో ప్రజలకు గుర్తులేదు. ఈ రంగాలన్నింటిని వైదికమే సృష్టించినదనే భ్రమలో వున్నారు. ఈ నేపథ్యంలో వీటి మూలాలు గురించి వాటి అడుగుజాడలను గూర్చి అన్వేషించాల్సి వుంది.

**నాటక రంగం** : బౌద్ధానికి ముందు కళారంగం వున్నట్టుగా చరిత్రలో ఎక్కడా నమోదు కాలేదు. ఒకవేళ వున్నప్పటికి దానికొక ప్రత్యేకత లేదు. బౌద్ధం జీవంపోసిన రంగాలలో నాటక రంగం ఒకటి. జానపద కళారీతుల్లో నాటకరంగ ఛాయలు మిణుకుమిణుకుమని కనిపించినా బౌద్ధం ఈ రంగాన్ని పరిపూర్ణం చేసింది. ఆంధ్రదేశంలోనే ఈ కళారీతి పుట్టినట్లు చారిత్రకాధారం. బుద్ధుని జీవిత చరిత్రను 'నాటకం'గా మలిచి ప్రదర్శించారని బౌద్ధ వాఙ్మయం ఋజువు చేస్తున్నది. దక్కన్‌వాసియైన నటుడొకరు దక్షిణాపదం (పల్లవబొగ్గ–పల్నాడు–గుంటూరుజిల్లా) కొందరి నటీనటులతో కలిసి అనేక ప్రదర్శనలు ఇచ్చుకుంటూ మగధ చక్రవర్తి బింబిసార మహీపతి సమక్షంలో మహాబోధి వరకు, మరియు శోభావతి మహీపతి సమక్షమున ప్రదర్శించెనని సాహితీధారాలు లభించాయి. ఇంతవరకు లభించిన ఆధారాలను బట్టి ఇదియే మొదటి నాటకం. ఈ నాటకరంగమే ఈరోజు మనం చూస్తున్న సినిమా ఇతర రంగాలకు పునాదిగా నిలిచింది.

బుద్ధుని మీద, బౌద్ధ ధర్మం మీద, బౌద్ధంలో చారిత్రకాంశాల మీద ఎన్నో నాటకాలు రచించి దేశమంతటా ప్రదర్శించబడ్డాయి. అంతరంగ పరివర్తనకు, ఆత్మపరిత్యాగానికి, పడిన కష్టాలకు ధర్మబోధన విని పరివర్తన చెందిన వైనాన్ని కళ్ళకు కట్టినట్లు చూపే, సౌందరనందనం, దంతపురి చరిత్రనేపథ్యంలో రచించిన జగజ్యోతి, తిస్యరక్షిత, సామ్రాట్ అశోక, శాంతిపథం, అశ్వఘోషుడు, బుద్ధావతారం ఇలా ఎన్నో నాటకాలను రచించి దేశమంతటా ప్రదర్శించారు. మరీ ముఖ్యంగా 17, 18, 19, 20 శతాబ్దాల కాలంలో ఈ నాటకాల ప్రదర్శన విరివిగా జరిగినది.

నాటక రంగంతోపాటు అనేక కళారీతులను బౌద్ధం సృష్టించి జీవం పోసిందనడానికి కేవలం సాహిత్య ఆధారాలు మాత్రమే కాదు. పురావస్తు ఆధారాలు కూడ కోకొల్లలుగా లభ్యమైనాయి. నాగార్జునకొండలో అనుపువద్ద లభ్యమైన అద్భుతమైన కళావేదికను గమనించవచ్చు. ఇక్కడ నిర్మించిన స్టేడియం నేటి ఆధునిక కాలపు కళావేదికలను తలదన్నేలా అన్ని హంగులతో నిర్మించడాన్ని బట్టి బౌద్ధం వివిధ కళాప్రక్రియలకు ఇచ్చిన ప్రాధాన్యతను అంచనా వేయవచ్చు.

**గేయం – గానం** : బుద్ధుని జీవితాన్ని, ఆయన ధర్మాన్ని లయబద్ధంగా ఆలపించి ప్రచారం చేయడంలో చరిత్రకందినంతవరకు "యక్షగానమే" మొదటి గేయము, గానము. యక్షగానం నాటి నుండి నేటి వరకు మనుగడ సాగిస్తూనే వుంది. అయితే ఈ గానం చిలువలు, వలువులు చెందిన హరికథ, బుర్రకథ వంటి ఎన్నో కళారూపాలు పరిణామం చెందాయి. ఇవిగాక ఎన్నో జానపద కళారూపాలు ఆవిర్భవించాయి. ఇవన్నీ ఆనాడు బౌద్ధధర్మం చుట్టూ పరిభ్రమించినవే. బౌద్ధ జాతక కథలు వంటి సాహిత్య గ్రంథాలలో ఈ కళారూపాలకు చెందిన ఎన్నో ఆధారాలను చూడవచ్చు.

మరియు బౌద్ధశిల్పకళలో, చిత్రకళలో వివిధ రకాల వాయిద్య పరికరాలను గమనించ వచ్చు. ఇప్పటికి బౌద్ధధర్మంలో వినియోగించే 'గంట' ఇతర వాయిద్య పరికరాలను వినియోగించడం ఆనాటి సంగీత, గాన కళారూపాలకు కొనసాగింపుగానే మనం అంచనావేయాలి.

**శిల్పకళ** : సజీవుడు, దృఢగాత్రుడు, స్ఫురద్రూపి అయిన బౌద్ధశిల్పి యొక్క సూక్ష్మదృష్టికి ఆంధ్రమున బౌద్ధమవతరించుట, శిల్పము తొలకరించుట ఒకే కాలంలో జరిగింది. బౌద్ధధర్మము నుండి జనియించిన కళారూపాలలో 'శిల్పకళ' పేరెన్నికగన్నది. బుద్ధుని కాలంలో బౌద్ధధర్మం లిఖితం కాని సమయంలో శిల్పకళ ఆ లోటును ప్రతిభావంతంగా భర్తీచేసింది. అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన ఈ కళ ఆనాటి సామాజికాంశాలతోపాటు, బుద్ధుని జీవితం, ధర్మంలోని విశేషాంశాలను, ఆధ్యాత్మిక, ధార్మిక అంశాలను శిల్పాల రూపంలో కనులవిందు చేసిన బౌద్ధశిల్పి కృషి అనిర్వచనీయం. బౌద్ధానికి ముందు శిల్పం లేదు. బౌద్ధం సృష్టించిన ఈ శిల్పకళకి ఆంధ్రాప్రాంతమే పుట్టినిల్లుగా భాసిల్లినది. మొత్తం భారతదేశంలో మూడురకాల శిల్పకళలను పేర్కొంటారు.

1. అమరావతి శిల్పకళ (Amaravathi School of Art)
2. గాంధార శిల్పకళ (Gandhara School of Art)
3. మధుర శిల్పకళ (Madhura School of Art)

ఈ మూడు శిల్పకళారీతులు బౌద్ధాన్ని అనుసరించేవే. శిల్పకళలో సజీవత, ఆకర్షణ చూపరులను మంత్రముగ్ధులను చేసి తన్మయత్వానికి గురిచేసే ఈ కళారూపం ఆంధ్రుల పేటెంట్ హక్కుగా భావించాలి. బౌద్ధశిల్పి యొక్క సృజనాత్మకత, నైపుణ్యాలను అంచనావేయలేము. అతి సూక్ష్మశిల్పం నుండి భారీ కట్టడాల వరకు శిల్పి చూపిన చొరవ, నైపుణ్యం వెలకట్టలేనివి. బౌద్ధశిల్పి చేతిలో కఠిన శిలలు మైనంగా కరిగాయి. అతని చేతిలోని 'ఉలి' కలాలై కళాఖండాలను సృష్టించాయి. శిల్పంలో సజీవము, సహజత్వాలు, స్త్రీ, పురుషుల సుందర వదనము, కోమలత్వములను పొదిగిన బౌద్ధశిల్పి యొక్క పనితనం, రసజ్ఞతకు ప్రపంచం శిరస్సు వంచి నమస్కరించింది.

కేవలం 'శిల్పకళ' అనేది పూజ్యనీయమైన విగ్రహాలకే పరిమితం కాలేదు. వివిధ కళారూపాలను అతిసూక్ష్మస్థాయినుండి అతి భారీ స్థాయి వరకు కట్టడాలను నిర్మించడంలో బౌద్ధశిల్పి అనితరసాధ్యమైన కృషి చేసారు. చివరకు ఈ శిల్పకళ ఎంతకు దారితీసిందంటే అశోకుని శాసనాలు, స్తంభాలు, కుషాణుల శిల్పాలు

చరిత్రను నిక్కచ్చిగా నమోదు చేసాయి. శిల్పం భారతీయ సంస్కృతికి ఒక అజరామరమైన కళాప్రక్రియగా నిలిచిపోయింది. భారతీయ చరిత్ర, సంస్కృతులకు ఈ కళారూపమే సజీవ సాక్ష్యమయింది.

**చిత్రకళ** : బౌద్ధం సృష్టించిన మరో అద్భుత కళారూపం "చిత్రకళ'. చిత్రకారుడు మొదట బౌద్ధుడు. రసాయన శాస్త్రంలో నిష్ణాతుడు. ఏ పదార్థాలను మిశ్రమం చేయాలి? ఏ రసాయనాలకు నాణ్యత ఉన్నదో బాగా తెలిసినవాడు. తన కుంచెతో చిత్రకళకు రంగురంగుల రంగులద్దినవాడు. అజంతా చిత్రకళ భారతీయ సంస్కృతికి ఒక మచ్చుతునక. ఎంతో టెక్నాలజి సాధించిన దేశాలు కూడ అజంతా చిత్రకళను అధిగమించలేకపోయాయి. క్రీ.శ. 2-3 శతాబ్దాల కాలంలో గీయబడిన అజంతా చిత్రం ఇప్పటికీ దాని వన్నె తగ్గలేదంటే బౌద్ధ చిత్రకారుడు ఎంతటి జ్ఞానఘనుడో అవగాహన చేసుకోవచ్చు. అజంతా చిత్రాలు, అమరావతి శిల్పాలు గాయకులకు గేయాలైనాయి, సంగీతకారులకు స్వరమాధుర్యాలైనాయి. కవులకు కావ్య మకుటాలైనాయి. నర్తకులకు నాట్యశిఖామణులైనాయి. చరిత్రకారులకు ఎన్ని రకాలైనా తరగని పరిశోధనాంశాలైనవి. ఇది బౌద్ధం ప్రభవించిన కళారూపాలు. కళలకే కాణాచిగా నిలిచిన వెలిగిన బౌద్ధం యొక్క కీర్తి అజరామరం. అచంచల మానవీయ కోణం. మళ్ళీ ఆ శిల్పాలు చెక్కడానికి, ఆ చిత్రాలు గీయడానికి బౌద్ధ శిల్పులు, చిత్రకారులు మళ్ళీ పుట్టాలి. మళ్ళీ ఈ దేశ సంస్కృతిని పునర్జీవింపచేయాలి.

**మార్షల్ ఆర్ట్స్** : బౌద్ధం ప్రసాదించిన మరో కళారూపం మార్షల్ ఆర్ట్స్. బౌద్ధ భిక్షువులు కటోర సాధన ఫలితంగా జనియించిన ధ్యానం, మార్షల్ ఆర్ట్స్ మానవుని ఆయుష్షును పెంచడంతోపాటు, ఏకాగ్రతను సాధించాడు. ఈర్ష్యాద్వేషాలనే దుర్గంధాలను సమూలంగా విడిచిపెట్టాడు. మార్షల్ ఆర్ట్స్‌లో కరాటే, కుంగ్‌ఫూ, విలువిద్య వంటి అనేక యుద్ధ విద్యలను నేర్చాడు. బోధిధర్ముడు వంటి బౌద్ధుడు ఈ మార్షల్ ఆర్ట్స్‌లో నిష్ణాతుడు కావడం వల్లనే జపాన్ లాంటి దేశాలు ఇతనిని రెండవ బుద్ధుడుగా గౌరవిస్తారు.

సాహిత్య, సాంకేతిక, కళారంగాలలో బౌద్ధం చూపిన అసమాన్య ప్రతిభా పాతవాలకు ఈరోజు ప్రపంచ దేశాలు బౌద్ధాన్ని అనుసరిస్తూ అభివృద్ధిలో ముందున్నాయి. ఇది బౌద్ధం అందించిన 'జ్ఞానం' అని నినదించి చెప్పడానికి ప్రతి భారతీయుడు గర్వించతగ్గ స్థాయిలో నిలబడినాడంటే, బౌద్ధం చేసిన కృషి, సాధించిన విజయాలు ఎప్పటికీ అనుసరణీయమే.

* * *

# 7. సాహిత్యము, కళలు - సామాజిక ప్రమాణాలు

-కన్నెబోయిన అంజయ్య, కళాంజలి సాంస్కృతిక సమాఖ్య, ఖమ్మం.

సమరాలకు సైదోడుగా నిలిచిన కళలు, కళాకారులు, పోరాటాలకు పదునెక్కించిన గాయకులు, పాటలు, ఉద్యమాలకు ఊపిరిలూదిన బుర్రకథలు, నిర్వాహకులు ప్రజల మనస్సును ఆనంద డోలికల్లో పరవశింపజేసిన, హరికథలు, కథకులు, భక్తి భావాన్ని గగనపు అరామల్లోకి తీసికెళ్ళిన పౌరాణికాలు, ప్రజల మనస్సులను, రంజింపజేసి, భుక్తి గడుపుకున్న వీధి భాగవతులు పై కళలన్ని ఒకప్పుడు ప్రజల్ని మెప్పించి ఒప్పించి తృణమో, పణమో వారి నుంచి పొందిన సందర్భం ఉన్నది, అందుకే ప్రజల మనస్సులో ఉన్న భక్తిని, రామాయణ, భారత, కథలను విస్తృతంగా ప్రచారం చేశారు. ఆ భక్తిభావం నేటికి చెదరని ముద్రగా ప్రజల మనస్సుల్లో నిలిచినందుననే ఆధ్యాత్మిక వాదుల పని సులువైనది.

వాల్మీకి రామాయణ ఇతిహాసాన్ని రాయటానికిముందే ఆదర్శపురుషుడు ఎవడు అని వెతికినట్టు, ఆరుద్ర తన రాముడికి సీత ఏమౌతుంది అనే పుస్తకంలో ఉటంకించాడు, వాల్మీకికి దొరికిన సమాచారమేమంటే, రాముడనే అతనిని ఆదర్శ పురుషుడుగా, కళాకారులు, కథల రూపంలో, చెప్పుకుంటున్నారని, అంటే రామాయణ ప్రచారానికి కళలు కళాకారులు కృషి ఉన్నదని అర్ధమౌతుంది. అలా ఒకప్పుడు భక్తిభావాన్ని పెంచిన కళలు, పాటలు, శ్రమ జీవుల నుంచేపుట్టినవని, మనకు అర్ధమౌతుంది. శ్రమజీవులు, పనులు చేస్తూ శ్రమ మర్చిపోటానికి, నోటికొచ్చిన సాహిత్యంతో, రాగాన్ని జోడించి, పాటగా మార్చి, తరువాత, పాటకు హావ భావాన్ని జత చేయటం, వలనే అది కళలుగా వికసించాయని, నైపుణ్యత పెరిగిన కొద్ది, బుర్రకథలు, హరికథలు, మరియు, పౌరాణికాలు, వీధి భాగవతాలు, మరిన్ని కళలు, ఇలా సమాజంలోనికి వచ్చాయని చెప్పక తప్పదు.

ఇదంతా గతం, ఆనాటి కళలు పాటలు, ప్రజా కళలుగా ఏర్పడటానికి నాంది ఏమిటి? మనం బానిస వ్యవస్థ, భూస్వామ్య వ్యవస్థ, పెట్టుబడిదారి వ్యవస్తల మధ్య నలిగి తిరుగుబాటుకు, పురికొల్పిన సంఘటనలే ప్రజా కళలుగా, పాటలుగా ఆవిర్భవించాయి అనటానికి చరిత్ర మనకు సాక్ష్యంగా నిలుస్తుంది.

కార్మిక, కర్షక, బడుగు, బలహీనుల వెట్టి చాకిరి నుంచి విముక్తి కలిగించే క్రమంలో మార్క్సు మహనీయుని ఆశయ సాధనలో, భాగంగా సోషలిజం సాధనలో భాగంగా ఏర్పడిన ఉద్యమాలకు కళలు, పాటలు ఉపయోగపడ్డాయని తెలుస్తున్నది. పాటలె తూటాలై, కళలే విప్లవ శంఖాలై, పూరించినట్టుగా మనకందిన సాహిత్యం చెపుతున్నది. నక్కిన ప్రజలని ఉక్కు ఉద్యమపౌరులుగా, ఉద్యమకారులుగా తీర్చిదిద్దినాయి. ఈ సాహిత్యంలో అనేకమంది తమతమ కలాలకు పదునుపెట్టి పదునైన పాటలను రాశారు. ఓ సందర్భంలో నాజరు అంటాడు. "ఎన్నాళ్ళ కాపురాలు ఏ చెరో చెరో పడి చేద్దామన్నా రాజనాలు పండించే రైతుకు భోజనానికే బొత్తిగ లేదు, పేదల కష్టం ప్రభువుల పాలు, బాధలన్ని ఈ పేదల పాలా" అని బాలకార్మికుల వెట్టి చాకిరి నుంచి తండ్రి చేసిన అప్పులకు పసిపిల్లలను బానిసలుగా గడీలలో చాకిరిపై స్పందించిన తెలంగాణ యాదగిరి అంటాడు "పాలుత్రాగే పిల్లవాడా పసులగాసే మొనగాడా పాలు మర్చి ఎన్నాళ్ళయ్యింది. ఓ పాలబుగ్గల జీతగాడా ఊడిగమే నీ జీవితమయిందా" అని హృదయాన్ని కదిలించే పాట.

స్వాతంత్ర్య, పోరాటంలో కూడా రచయితలు గాయకులు, కళాకారులు తమ యొక్క రీతిలో స్పందించారని వందేమాతరం సుజలాం సుఫలం మలయజ శీతలాం అంటూ పాడి తమ పోరాటాన్ని పాట ద్వారా తెలిపారు. మాకొద్దీ తెల్ల దొరతనము అనే పాట ఆంధ్ర దేశమంతా మారుమ్రోగి స్వాతంత్ర్యోద్యమానికి బాటలు వేసింది. అదే సమయంలో తెలంగాణాలో నిజాం నిరంకుశ రాచరికపు పాలనలో ప్రజలు నిత్యము దోపిడీలు, దౌర్జన్యాలు, అరాచకపు రజాకార్ల, అణచివేతలతో బానిసలుగా బతుకులీడుస్తున్న తెలంగాణ ప్రజలలో, చైతన్యపు వెలుగులు నింపేందుకు ఆనాడు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన పోరు మొదలైనప్పుడు పదండి ముందుకు అంటూ పాటను తూటాగా పేల్చి ప్రజల్ని చైతన్యపర్చిన ప్రజానాట్యమండలి ముందు వరసలో ఉంది. కసితో రేగిన ఉద్యమకారులకు బండియాదగిరి ఓపాట అందించాడు. "బండెనక బండిగట్టి పదహారు బండ్లు గట్టి ఏ బండ్లేబోతవ్ కొడుకో నైజామునరకరోడ. నాజీల మించినవ్‌రో నైజాము నరకరోడ చుట్టుపట్టు సుర్యాపేట నట్టనడుమ నల్లగొండ ఆ పక్కన హైదరాబాదు దాని ప్రక్కన గోలుకొండ గోలుకొండ ఖిల్లా కింద నీగోరిగడత కొడుకో నైజాము నరకరోడ" అనే పాట నిజాం సర్కారును కూలదోసింది. కళలు, కళాకారులు, రచయితలు గాయకులు సాహసంతో కూడిన సమరానికి సైనికులై

పోరాడి అలసిపోయిన అన్నలకు యోధులకు సాహిత్య లేపనంతో రాగాన్ని జోడించి ఉత్తేజం బాపి గమ్యం వైపు గమనాన్ని తెలిపి, "పదండి ముందుకు పదండి తోసుకు పదండి పోదాం పోదాం పైపైకి" అన్న శ్రీశ్రీ పాట పోరాట యోధులను వెన్ను చూపనీయలేదు. తిన్న పళ్ళెం, త్రాగిన చెంబు చేతిన కర్రె వాయిద్యాలై ఉద్యమానికి ఊపిరులు ఊదాయి. ఒకవైపు గడీలపై దాడులు, మరోవైపు రజాకార్లపై తిరుగుబాటు ఈ సందర్భములోనే ప్రజాకళలు ప్రారంభం అయ్యాయి. దానికి, ప్రజా నాట్యమండలి నాయకత్వం వహించింది. పాటలతో నాటకాలతో, వీధి భాగవతాలు, బుర్రకథ, హరికథతో ఎక్కడ బడితే అక్కడ వందల మందిని వేల మందిని పోగేసి పాటలతో కళారూపాలతో ప్రదర్శనలు ఇస్తూ పోరాటానికి యోధులను తయారుచేసిన ఘన చరిత్ర కళాకారులది.

తెలుగు వీర లేవర దీక్ష బూని సాగరా దేశమాత స్వేచ్ఛ కోరి తిరుగుబాటు చేయరా అన్న పాట సమరోత్సాహాన్ని నింపిందీ కదిలింది విప్లవాగ్ని ఈరోజు ఆ అగ్నిపేరె అల్లూరి సీతారామరాజు. జలియన్ వాలా బాగున జరిగిన మారణకాండ అన్నపాటలు రోమాలు నిక్కబొడుచుకుంటాయి. సుంకర సత్యనారాయణగారు రాసిన మరో భూమి, భూమికోసం, నాటకాలు తదనంతరం కాలంలో సినిమాలు కూడా తీశారు. ఈనాటి సినీ నిర్మాతలు., దర్శకుల్లా కాక సమాజ చైతన్యం కోసం నాటి రుగ్మతలపై అభ్యుదయ సినిమాలు తీశారు నాటి నిర్మాతలు, దర్శకులు. దానికి కారణం తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటమే అన్న సత్యం నాకందించిన సాహిత్య, సాంస్కృతిక స్ఫూర్తి మాత్రమే.

1945-47 మధ్య కాలంలోనే తెలంగాణ ప్రజలు నిజాం సర్కారుపై తిరుగుబాటు చేసినప్పుడు సాయుధులైన పోరాట యోధులు ఎర్రజండా ఎత్తిన కమ్యూనిస్టులు నాలుగు వేలమంది వీర మరణం పొందారు. ఈ సందర్భములోనే తిరుగుబాటుకు స్ఫూర్తిని కలిగిస్తున్న కళాకారులపై నిజాం ప్రభువుల కన్ను పడింది. కళాకారుల వల్లనే పోరాటం ఉధృతం అవుతుందని నైజాం సరకారు కళలపై నిషేధం విధించింది. కళాకారులంతా అండర్ గ్రౌండులో ఉంటూనే సందర్భం వచ్చినప్పుడు సందు దొరికినప్పుడల్లా ప్రదర్శనలిస్తూ కళాకారులు ఉద్యమస్ఫూర్తి రగిలిస్తూనే తెలంగాణాను వదలి ఆంధ్రలో ఉంటూ నైజాం సరకారును తూర్పార పట్టారు.

కళల ద్వారా ఇంత గొప్ప మేటి ఘనచరిత్ర కళాకారులకు ఉంది. ఇలా అనేక ఇబ్బందులు పడుతూ కళాకారులంతా మద్రాసు చేరి సినిమా ఇండస్ట్రీని ప్రారంభించి సినిమాలు తీసినట్టు మనకు చరిత్ర చెప్పిన సాక్ష్యం.

ఆరుద్ర, ఆత్రేయ, నారాయణరెడ్డి, శ్రీశ్రీలు సినీ పరిశ్రమకు అందించిన సాహిత్యం మనిషిని మనిషిగా నిలపటానికి ఉపయోగపడ్డాయి. స్వర్గం, నరకం, పాపం, పుణ్యం మరుజన్మ లాంటి మానవునికి ఉపయోగపడని సాహిత్యం పుంఖాను పుంఖాలుగా వస్తున్నప్పుడు శ్రీశ్రీ రాసిన పాట "చక్రవర్తి అశోకుడెక్కడ జగద్గురు శంకరుడెక్కడ బ్రహ్మనాయుని బాలచంద్రుని ప్రాణవాయువెక్కడమ్మా" ఈ పాట పునర్జన్మను ప్రశ్నించింది. మనిషికి ఉపయోగపడని సాహిత్యంపై అనేకమంది రచయితలు సాహిత్య విప్లవాన్ని సృష్టించారు వారిలో, గుర్రం జాషువా పద్యం. "ఎన్నో ఏండ్లు గతించిపోయినదీ కానీ ఈ స్మశాన స్థలిన్ కన్నులు మోడ్చిన మందభాగ్యుడు ఒక్కడైనన్ లేచిరాడు" అన్నాడు. అలాగే అన్నదమ్ములును ఆలుబిడ్డలును కన్నతల్లితండ్రులు వెంటరారు తుదిన్ వెంటవచ్చునది యశస్సు (కీర్తి) సమాజాన్ని దోచుకుని నావాళ్ళకు సంపదను కూడబెట్టి కుబేరులం కావాలనుకునే వారికి గొడ్డలిపెట్టులాంటి సాహిత్యం. మార్పు కొరకు సాహిత్యం కళలు కలసికట్టు కృషిచేసి ఆధ్యాత్మిక, భక్తిభావ కళలను తిప్పికొట్టాయి. నర్మగర్భంగా రచయిత అంటాడు "ఏడుకొండల వాడా ఓ వెంకటారమణ ఎన్ని మెట్లెక్కినా కానారావేమయ్యా" అని పాటల సాహిత్యం గాయకులగానం ప్రగతికి సోపానాలయ్యాయి. పాటలు, సూటిగా మనిషి హృదయాన్ని తాకి రంజిల్లజేస్తాయి విప్లవింపజేస్తాయి అనడంలో సందేహం లేదు. అందుకే ఎక్కువమంది రచయితలు పాటలు పద్యాలు రాసి చైతన్యపర్చాలని ప్రయత్నించారు. వేమన కూడా విశ్వమంత సమస్యను మూడు లైన్ల పద్యాలు రాసి బ్రిటీష్ అధికారి సి.పి. బ్రౌన్ మెచ్చుకొనేలా ప్రసిద్ధికెక్కారు.

తల్లి గర్భము నుండి ధనముతేడెవ్వడు వెళ్ళిపోయేనాడు వెంటరాదు అంటూ పద్యంలోనే తన అభిప్రాయాన్ని సమాజానికందించాడు వేమన. తన హేతువాద భావాన్ని పద్యంలోనే ఇలా వెలిబుచ్చాడు. "పిండములనుజేసి పితరులకు తలపోసి కాకులకు పెట్టుగాడ్దెలారా, పెంట తినెడి కాకి పితరు డెట్టాయెరా అంటూ

రాగయుక్తంగా చెప్పాడు. రాగం ద్వారా చెప్పితే శ్రోత హృదయాన్ని ఆకర్షించవచ్చు అనే అభిప్రాయం రచయితకు ఉన్నట్లు అర్థం చేసుకోవాలి. హరిశ్చంద్ర నాటకంలో రచయితలు ఎంత ఆధ్యాత్మిక భావాన్ని చొప్పించారో అంత హేతువాద భావజాలాన్ని చొప్పించారు. అంతెందుకు ఒక సబ్బు అమ్ముకునేవాడు ఒక పౌడరు అమ్ముకునేవాడు ఓ ప్రొడక్టు ఏదైనా ప్రజలకు తెలియజెప్పేందుకు కళాత్మకంగా పాటలతోనే ప్రచారం చేస్తారు.

సమాజాన్ని సంస్కరించాలని దోపిడి, దౌర్జన్యం, రుగ్మతలు లేని సమాజాన్ని సృష్టించాలని సాహిత్యాన్ని రాగయుక్తంగా మలిచారు నాటి రచయితలు. జానపద సాహిత్యాన్ని పరిశీలిస్తే జానపదమే గానపదమై సినీ ఇండస్ట్రీకి కాసుల వర్షం కురిపించింది. జానపదులు, పల్లెపడుచులు నాట్లు వేస్తు, కోతలు కోస్తూ, మార్పిడి చేస్తు, పంటలను బండ్లకెత్తుతు పుక్కిటి నుంచి వచ్చే సాహిత్యానికి బాణికట్టి రాగమాలపిస్తు పాడుతూ శ్రమ మర్చిపోతూ అలిసిపోకుండ ఉండేవారు.

నిన్ను ప్రేమిస్తున్నాను. మనువాడతాను అన్న మరదలను మరదలు తన అభిప్రాయాన్ని పాట ద్వారా ఎలా చెప్పిందో చూద్దాం, 'చెట్టులెక్కగలవా నరహరి పుట్టలెక్కగలదా చెట్టు లెక్కి ఆ చిటారు కొమ్మల చిగురు కోయగలవా? బావకూడ రాగయుక్తంగా చెట్టు లెక్కగలనే చెంచిత, పుట్ట లెక్కగలనే చెట్టులెక్కి ఆ చిటారు కొమ్మన చిగురు కోయగలనే' ఇలా మనం గతం పరిశీలిస్తే పాటలకు, కళలకు, కళాకారులకు, అంతులేని ప్రాధాన్యత ఉన్నదని చెప్పవచ్చు. వడ్లు దంచేటప్పుడు పాట 'దంచవే మేనత్త కూతుర వడ్లు దంచవే నా గుండె లదర' ఇలా చక్కని సాహిత్యాన్ని రాగయుక్తంగా పలికించి ఆనందింపచేశారు, ఆనందపడ్డారు. పెండ్లి వేడుకలలో మగ పెండ్లివారు, ఆడపెండ్లివారు ఎదురెదురుగా జట్టుగా చేతులు పట్టి ముందుకు, వెనుకకు, అడుగులు వేస్తు ఇల్లు లేనోనికి నా బిడ్డనిస్తిని దమమడాలియలో అప్పుడే తెలిసినా, గుప్పిచ్చివందునా దమ్మడాలియలో ఇలా ఆడపెండ్లివారు పాడగా అంతే ధీటుగా మగపెండ్లివారు పాటలు పాడుతు ఆటలాడుతూ కళాత్మకంగా పెండ్లి వేడుక జరిగేది. అడవులలో జీవిస్తున్న తండాలలో జీవిస్తున్న ఆదివాసీయులు జంతువుల చర్మంతో డంకాలు, డమరుకాలు తయారుచేసి వాటి శబ్దంతో లయతప్పకుండ పాటలు పాడుతూ ఆటలు ఆడుతూ పండుగలు, విందులు వినోదాలు జరిపి జనులంతా పోగై సంబరపడేవారు. ఇలా సంస్కృతిలో భాగస్వామ్యమైనాయి

కళలు పాటలు. కళలు లేని, వినోదాలు, ఉద్యమాలు, పోరాటాలు నిరుపయోగాలు, విప్లవాలను ఉరకలెత్తించిన పాటలు కీ.శే. వంగపండు రాసిన "ఏంపిలడో ఎళ్ధమొస్తవా శ్రీకాకుళంలో సీమకొండకు ॥ఏం॥ చిలకలు కత్తులు దులపరిస్తయట॥ఏం॥ తుపాకి పట్టిన తూనీగలున్నయట ॥ఏం॥" పాటామజాకా.

గురజాడ వారి పాట ప్రపంచమే మెచ్చింది. "దేశమును ప్రేమించుమన్న మంచియన్నది పెంచుమన్న దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుష్యులోయ్". ఏ దేశం కాదంటుంది ఈ పాటను! మహాకవి శ్రీశ్రీ అన్నాడు పాటలో "స్వాతంత్ర్యం వచ్చెనని సభలే చేసి సంబరపడగానే సరిపోదోయి. అవినీతి బంధుప్రీతి చీకటి బజారు, అలుముకున్న ఈ దేశం ఎటు దిగజారుర్ఘు కాంచవోయి నేటి దుస్థితి ఎదురించవోయి ఈ పరిస్థితి!" 50 సంవత్సరాల నాడు రాసిన ఈ పాట వింటుంటే రోమాలు నిక్కబొడుస్తాయి. అందుకే నేను నా ఆలోచనలకు అణుగుణంగా అనేక పాటలు, పద్యాలు రాశాను నా పద్యం, చచ్చిగోతిలో ఉన్న శవసమాధికి మ్రొక్కవరము లెవడిచ్చురా వెర్రివాడా శిలువపై శీలలు కొట్టినప్పుడులేని శక్తి ఇపుడెట్లొచ్చు చెప్పరా భడవా అని. నాజరు ఒక బుర్రకథలో అంటాడు. పంతులమ్మను బదిలి చేసెరా సౌ॥ పంతులయ్యకు దూరం జేసేరా సై॥ ఇంటిచుట్టు తిప్పుచుండెరా ॥సై॥ ఆశలేవో చూపెడతా ॥భళా॥ మధుజీవనులు మాన్యులెందరో మన్నయి నారన్నా మనం మాత్రమిట శాస్వితమ్ముగా మనగలమంటు బుర్రకథ ఆలపించారు! వేమన అంటారు "రాతిబొమ్మలకేల రంగైన వలువలు గోపురములు కుంభములును కూడుగుడ్డతాను కోరునా దైవంబు?" అణుబాంబుకన్నా అత్యాధునిక ఆయుధాలకన్నా, శక్తివంతమైనవి, పాటలు కళలు అన్న నా అభిప్రాయం మీ ముందుంచాను. శెలవు.

* * *

# 8. బహుజన సమాజం కోసం ప్రత్యామ్నాయ కళలు, సంస్కృతి

- మాస్టార్జీ, విశ్వజన కళామండలి, హైదరాబాద్

మానవ పరిణామ క్రమంలో నేడు భారతదేశంగా పిలువబడుచున్న ప్రాంతం ఒకనాటి జంబు ద్వీప కల్పంలోని భాగం. ప్రపంచంలోని అన్ని దేశాలలాగే ఈ ప్రాంతంలో కూడా మాతృస్వామిక వ్యవస్థ పరిఢవిల్లిన ప్రాంతమే. వలసవాదులైన ఆర్యుల దండయాత్రలతో మొదలైన ఈప్రాంత ఆక్రమణలు వరుసగా ఆసియా, ఐరోపా దేశాలకు సంబంధించిన ఆంగ్లేయులు, డచ్, ఫ్రెంచి తురుష్కులు చిన్నచిన్న సైన్యాలతో గాడిదలు, గుర్రాలపైన వచ్చిన కొందరు, వ్యాపార మిషతో మరికొందరు ఈ దేశాన్ని ఆక్రమించుకొని, ఈ దేశ మూలవాసుల భాషను, ఈదేశ మూలవాసుల భాషను, సంస్కృతిని ధ్వంసం చేశారు. ఇందులో ప్రధానంగా ఆర్యవలసవాదులు సకల సంపదలున్న దేశం కనుక తాము ఈ ప్రాంతంలోనే తిష్ఠవేయడం కోసం కర్మ, ధర్మ, పునర్జన్మ స్వర్గ నరకాల బూచిని చూపి ఈ దేశ మూలవాసులను వర్ణ విభజన పేర 3600 కులాలుగా విభజించి వారి ఆర్య మనువాద బ్రాహ్మణీయ భావజాలంతో కొన్ని వేల సంవత్సరాలుగా ఆధిపత్య కులాలుగా వుంటూ, ఈ దేశపు అన్ని అధికారాలను హస్తగతం చేసుకొని, నేటికి కూడా పాలకులుగా చెలామని అవుతూ వస్తున్నారు. ఇందుకోసం తమ వలసవాద వర్గప్రయోజనాలను కాపాడుకోవడం కోసం తమదంటూ ఒక సంస్కృతిని, సంగీత, సాహిత్య నృత్య కళారూపాలను సృష్టించుకొని తమ సంస్కృతిలో "మా సంస్కృతే శిష్ట సంస్కృతి" యని నమ్మబలుకుతూ ఇంతవరకు, దుష్టపాలనను కొనసాగిస్తూ ఈ దేశ మూల వాసులను వారు సృష్టించిన ఆ సాంస్కృతిక ఊబి నుండి బయట పడకుండా వుండడం కోసం అనేక కళారూపాలను సృష్టించి ప్రచారంలో పెడుతూ వస్తున్నారు. ఇందుకోసం సన్యాసులను, పీఠాధిపతులను, మఠాధిపతులను, అమ్మలను, బాబాలను ఒక వర్గంగా తయారుచేసి, మన మనోవికాసాలు ఎదగకుండా ముఖ్యంగా హరికథలు, బుర్రకథలు, ఒగ్గు కథలు, జంకుల కథలు, తప్పెటగుళ్ళు, చెక్క భజనలు, కోలాటాలతో మొదలుకొని అనేక రూపాలలో మన బుర్రలలోకి చొప్పిస్తూ, వారి మనువాద సంస్కృతిని నిరాయమానంగా రక్షించుకోవడం కోసం వాడుకుంటూ వస్తున్నారు.

ఆశ్చర్యకరమైన విషయమేంటంటే ఈ దేశ మూలవాసుల రక్షకులను, రాజులను, గణాధిపతులను, నీచులుగా, మ్లేచ్ఛులుగా, దుష్ఠ దుర్మార్గులుగా చిత్రీకరించి, వీరందరూ రాక్షసులని పేరు పెట్టి తాము దేవుళ్లుగా, వారి ప్రతినిధులుగా చెలామని కావడం కోసం ఈ దేశ మూలవాసులనే భిక్షగాళ్ళుగా గంగిరెద్దు, గోసంగి, జంగమ, బైండ్ల, పిచ్చుకుంట్ల వంటి కులాలను కేవలం తమ సంస్కృతిని ప్రచారం చేసే వర్గాల వారిగా తయారు చేశారు.

ఈ క్రమంలోనే గౌతమ బుద్ధుడు 2600 సంవత్సరాలకు పూర్వం ఆర్య మనువాదులు సృష్టించిన అవాస్తవ, అభౌతిక భ్రమ కల్పిత భావజాలాల్లో వున్న లొసుగులను యజ్ఞయాగాలు, తిథి నక్షత్రాలు, దుర్ముహూర్త జ్యోతిష్యశాస్త్రాలలో గల మర్మాలను, లొసుగులను బయటపెట్టి ప్రత్యామ్నాయ సంస్కృతిని సృష్టించిన మహాతత్వవేత్తగా ఈయనే మొట్టమొదటివారు. ఈయన పరంపరనే కొనసాగినవారు బసవేశ్వరుడు, కబీరు, రవిదాసు, గురునానక్ వంటి వారితోపాటు మహాత్మా జ్యోతిబా పూలే, నారాయణగురు, ఛత్రపతి సాహుమహరాజ్, పెరియార్ రామస్వామి నాయకర్, బాబాసాహెబ్ అంబేద్కర్, సంత్‌గాడ్గేబాబా, మాన్యశ్రీ కాన్షీరాం వంటి మహనీయులు తాము సృష్టించిన ప్రత్యామ్నాయ పద్ధతులతో ఈ దేశ మూలవాసులకు ఈ కాస్తయినా విముక్తిని కలిగించి, వారు నేడున్న స్థితికి రాగలిగేలా చేశారు.

ఈ క్రమంలోనే మార్క్సిస్ట్ ప్రభావంతో ఈ దేశంలో కాలుపెట్టిన భావజాలం 1918 నుండి తమ కమ్యూనిస్ట్ సిద్ధాంతాలను ప్రచారం చేయడం కోసం కొన్ని కళారూపాలను సృష్టించి ప్రజాబాహుళ్యంలోకి తమ భావజాలాన్ని పరివ్యాప్తం చేయుచూ తాము కూడా పూర్వం మనువాద భావజాలాన్ని ప్రచారం చేసిన బుర్రకథ, ఒగ్గుకథ, గొల్లసుద్దులు మొదలగు విధివిధానాలు, వేషభాషలు కొద్ది మార్పులు చేసి తమ పార్టీ సిద్ధాంతాలను ప్రజల్లోకి తీసుకువెళ్తూ వస్తున్నారు.

పై అంశమంతా ఈ వ్యాసానికి ఉపోద్ఘాతంగా తీసుకుంటే ప్రజా వాగ్గేయకారునిగా, మూలవాసుల సిద్ధాంతకర్తగా నేను పై వాటికి భిన్నంగా నూతన ప్రత్యామ్నాయ సంస్కృతిని నిర్మించాలని, అనేక కొత్త ఆవిష్కరణలకు నాంది పలకడం జరిగింది.

1. **జనకథ** :- ఇంతకు ముందే మనము పైన ప్రస్తావించియున్న ఆర్య మనువాద బ్రాహ్మణ సంస్కృతి పరిరక్షణ కోసం తెలుగునాట వాడుకున్న హరికథ, ఒగ్గుకథ, జంకుల కథ వంటి కథారూపాల వేషభాషలను, కట్టుబొట్టును కాదని నూటికి ఎనభై అయిదు శాతంగా వున్న ఈ దేశమూలవాసులకు బహుజన పితామహులైన బుద్ధుడు, బసవేశ్వరుడు, గురురవిదాస్, కబీర్‌దాస్, గురునానక్, మహాత్మా జ్యోతిబా పూలే, నారాయణ గురు, ఛత్రపతి సాహు మహరాజ్, బాబాసాహెబ్ అంబేద్కర్, గాడ్గే బాబా వంటి మహనీయులతోపాటు మాన్యశ్రీ కాన్షీరాం ఆలోచనలను ప్రజలకు తెలియజేయడం కోసం "జనకథ" అనే క్రొత్త కళారూపాన్ని సృష్టించాను.

ఈ కళారూపం కొండకోనల్లో బతుకు లీడుస్తూ విద్యావికాసానికి దూరంగా వున్న కోయ దొరల ఆహార్యాన్ని కట్టుబొట్టును తమ ప్రదర్శనకు వేషంగా మార్చుకొని ఇందుకోసం తమ ప్రదర్శన ప్రారంభగీతంగా పాడడం కోసం...

"కుర్రో కుర్రో.. కోయజాతుల నుండి...

ఈ దేశమేలినట్టి మూలవాసుల నుండి "అంటూ చేతులను చూస్తాము - జాతకాలు చెబుతాము, జరిగేవి చెబుతాము, ఒరిగేది చెబుతాము - ఉన్నది ఉన్నట్టు చెప్పి - లేనిది లేనట్టు చెప్పే ॥కుర్రో॥

అంటూ పల్లవి అనుపల్లవిగా పాడి ఈ దేశ మాతృస్వామిక వ్యవస్థకు కారణభూతాలైన సంరక్షకామణులగు స్త్రీమూర్తులు..

ఎల్లమ్మా, మల్లమ్మా - యానాది పోశమ్మ
కలకత్తా కాళమ్మ - బెజవాడ దుర్గమ్మ..

అంటూ తమ మూలపుటమ్మలను తలచుకొని ఆ రోజు ఆ ప్రదర్శనలో చెప్పే కథను, తమ పాటలను ఆట మాటలతో కలిపి **'జనకథ'** గా ప్రజలకు తెలియజేయడం ఈ కళారూపం యొక్క ప్రత్యేక లక్షణం. ఈ విధంగా ఈ కళారూపంతో కొన్ని వందల ప్రదర్శనలను విశ్వజన కళామండలి ఎలియాస్ ఆంధ్రప్రదేశ్ దళిత కళా మండలి పేర ఇస్తూ వచ్చాం.

**2. మూలవాసుల మాసోత్సవం:**

ప్రపంచ దేశాలలో రాచరిక వ్యవస్థైన, ప్రజాస్వామిక వ్యవస్థ ద్వారా పాలకులుగా దేశాలను పరిపాలించినవారు ప్రత్యేక సంస్కృతిని ఆచరిస్తున్నవారే ఎక్కువగా ఆయా దేశాలను పరిపాలిస్తూ వచ్చారు. ఇప్పటికీ పరిపాలిస్తుంది వారే!

**ఉదా :-** బుద్దిస్టుదేశాలు అయిన ఇస్లామిక్ దేశాలైన, క్రైస్తవ మత పద్ధతుల నాచరిస్తూ వారే ఈ ప్రపంచంలో గల అన్ని దేశాలలో పరిపాలకులుగా నూటికి తొంభై శాతం మంది వారే ఉన్నారన్న విషయం చాలామందికి తెలుసు. ఇందుకు కారణం బుద్ధిస్టులకు ఒక పూజా విధానం, హైందవులకు మరో విధానం, అలాగే క్రైస్తవులకు ముస్లింలకు, సిక్కులకు, పారశీకులకు ఒక ప్రత్యేకమైన కట్టుబొట్టు, మతంలో భాగంగా ఉద్భవించిన ఆచార వ్యవహారాలు భాషా పదబంధాలు వారిని ఒక కుదురు గుంపు (ఎథినిక్)గా వుండేలా మలుస్తుంది. ఆ గుంపు పెద్ద ఏ మాట చెబితే అదే ఆజ్ఞగా స్వీకరించివారు ఏ రాజును ఎన్నుకోమంటే ఆ రాజును, వారు ఏ ప్రభుత్వాన్ని తెమ్మంటే ఆ ప్రభుత్వాన్నే తెచ్చే విధానం గత కొన్ని వందల సంవత్సరాలుగా కొనసాగుతూ వస్తోంది. ఇందుకు ఆయా మతాధినేతలు గొర్రెల మందకు కంచెగా ప్రజలందరూ తమ పరిధిలో వుండేలా పూజా, ఆరాధనా, ప్రార్ధనా పద్ధతులను సృష్టించి వారివారి ఆధీనంలో పెట్టుకుంటూ వస్తున్నారు. ఇందుకు ఉదాహరణకు బ్రాహ్మణీయమనువాదులు పూజా పునస్కారాలు వేద పఠనాలు గాయిత్రీ మంత్రాలు బ్రహ్మోత్సవాలు పుష్కరాలు బాహాకరంగా చేసుకుంటే, క్రైస్తవులు చర్చి, కూటములు పవిత్ర పండగల పేరుతో తమ వర్గ ప్రయోజనాలు కాపాడుతుంటే ముస్లింలు మసీదు ప్రార్థనలు, బక్రీద్, రంజాన్ పవిత్ర మాసం వంటి ఆచార విధానాలతో తమ వర్గాన్ని కాపాడుకోవడం తెలిసిన విషయమే. అదే విధంగా పారశీకులు, సిక్కులు, జురాస్టియన్స్ వర్గాల వారు కూడా వారికంటూ ఒక సంస్కృతిని ఏర్పాటుచేసుకొని వారి వారి వర్గ ప్రయోజనాలను కాపాడుకుంటూ వస్తున్నారు.

అయితే ఈ దేశ మూలవాసులు 3600 కులాలుగా విభజించబడి తమ పూర్వపు సంస్కృతిని కొనసాగించలేక చెల్లాచెదురైన వారిని ఒక తాటిపైకి తెచ్చేందుకు ముస్లిం మతస్థుల రంజాన్ ఉపవాస పవిత్రమాసంగా పాటించే విధానాన్ని అలాగే క్రైస్తవుల ఉపవాస దినాలను బహుజనుల కోసం బహుశ భారతదేశంలోనే మొట్టమొదటిసారిగా మన్యశ్రీ కాన్షీరామ్ పుట్టిన మార్చి 15 నుండి బాబా సాహెబ్ అంబేద్కర్ పుట్టిన ఏప్రిల్ 14 వరకు గల నెల రోజులను “మూలవాసుల మాసోత్సవం”గా 1993 మార్చి 15న నేటి తెలంగాణ ముఖ్యమంత్రి నియోజక వర్గమైన గజ్వేల్ పట్టణమున దళిత వాడలో తెలంగాణ ముద్దుబిడ్డ ఆచార్య కొండాలక్ష్మణ్ బాపూజి గారి చేతుల మీదుగా ప్రారంభించి ఇప్పటి వరకు ప్రతి సంవత్సరం ఏదో ఒక ప్రాంతాన్ని ఎంపికచేసి ఈ కార్యక్రమాన్ని విశ్వజన కళామండలి ఆధ్వర్యంలో శక్తిమేరకు జరుపుతూ ఆఖరి పదిరోజులు, అనగా ... భారత మాజీ

ఉప ప్రధాని శ్రీ జగ్జీవన్ రాం పుట్టిన ఏప్రిల్ 5 నుండి బాబాసాహెబ్ అంబేద్కర్ పుట్టిన ఏప్రిల్ 14 వరకు గల పదిరోజులను బహుజన దశమోత్సవాలుగా జరుపుతూ, గత 5 సంవత్సరాల నుండి బహుజన పితామహుల చిత్రపటాన్ని ఆ పదిరోజుల పాటు పందిరి వేయించి దాన్ని "పవిత్ర పటమని" పేరు పెట్టి చివరిరోజున ఆ పటాన్ని ఊరేగించి, దళిత వాడలో గల కమ్యూనిటీ హాల్‌కు బహూకరించే పద్ధతిని ఏర్పాటుచేసి, ఈ దేశ మూలవాసులు శ్రీరామ నవమి, వినాయక చతుర్థివంటి దశమోత్సవాలకు ప్రత్యామ్నాయంగా బహుజనులు జరుపుకునేలా చేయడం వల్ల నేడు చాలామంది పెద్ద పెద్ద పదవుల్లో ఉన్న అధికారులతో పాటు అనేక సంఘాల వారు ఇపుడు ఈ కార్యక్రమాన్ని తమతమ ప్రాంతములలో ఈ మూలవాసుల మాసోత్సవం జరుపుకోవడానికి అవకాశం కలిగింది.

**3. వంద గొంతులు – వెయ్యి డప్పులు :** ప్రపంచ ఆదినాదమైన డప్పు యొక్క గొప్పతనాన్ని ప్రపంచానికి తెలియజేయడం కోసం 2010 ఏప్రిల్ 5వ తేదీన నాటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నిర్వహించిన "దళిత ఆత్మ గౌరవ ఉత్సవాల" కార్యక్రమ ప్రారంభ ఉత్సవంగా ఈ "వంద గొంతులు – వెయ్యిడప్పులు" అనే అంశంతో నాంపల్లి పబ్లిక్ గార్డెన్‌లో గత తెలుగు లలిత కళా తోరణం వేదికపై ఒక్క పాటను వందమంది పాడితే, వెయ్యి డప్పుల దరువుతో మూడు గంటలపాటు నిర్వహించిన కార్యక్రమం నాటి ముఖ్యమంత్రి గౌరవనీయులు కొణిజేటి రోశయ్య గారితో పాటు ఆయన మంత్రివర్గ సహచరులు యమ్.పి.లు, యమ్.ఎల్.ఏ. లతో పాటు 5000 మంది ప్రేక్షకులతోపాటు, అనేకమంది కళాప్రియులు ఈ కార్యక్రమంలో పాల్గొనగా డప్పు యొక్క గొప్పతనాన్ని ప్రపంచం తెలుసుకొనేలా చేయడం జరిగింది. ఈ కార్యక్రమం నిర్వహించిన తీరుపట్ల ఆనాటి వార్తాపత్రికలు దాదాపు వారం రోజులపాటు అనేక వార్తలు, కథనాలు, వ్యాసాలు ధారావాహికంగా ప్రచురించడం, టి.వి. ప్రసారాల్లో ప్రకటించం ఒక గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డు వంటి ఈ కార్యక్రమాన్ని తిలకించినవారు కొనియాడే అంతస్థాయికి చేరింది.

అనంతర కాలంలో ఇదే అంశాన్ని స్ఫూర్తిగా తీసుకొని ప్రముఖ గాయకుడు గద్దర్ గారు "ఒక సంఘటన – వెయ్యి కొవ్వత్తులంటూ ఒక కార్యక్రమాన్ని, మరొక ఆమె ప్రముఖ రాజకీయకుడి దాయాది కుటుంబానికి సంబంధించి, తనకు జరిగిన అన్యాయానికి నిరసనగా "వంద చెప్పులు – వెయ్యి డప్పులు" కార్యక్రమాన్ని నిర్వహించడం ఒక అంశమైతే... ఈ వందగొంతులు – వెయ్యి డప్పుల కార్యక్రమాన్ని చేయబోతున్నారని తెలుసుకొన్న కొంతమంది కాపీ మాస్టార్లు తిరుపతి దేవస్థానం

ఆధ్వర్యంలో సికింద్రాబాద్ పరేడ్ మైదానంలో ఆదర బాదరగా అన్నమయ్య పేర లక్ష గళార్చన కార్యక్రమాన్ని చేయించడం వెనుక గల మర్మం చాలామందికి తెలియదు.

**4. భీమ – బౌద్ధ పీఠం :–** మనిషి కొన్ని కోట్ల సంవత్సరాల పూర్వం నేటి ఆఫ్రికా ఖండంలో జీవం పోసుకున్న ప్రాంతాన్ని క్రేడిల్ ఆఫ్ హ్యూమన్ బీయింగ్ ప్రాంతంగా పిలువబడుచు, నేటికి ఈ ప్రాంతం గొప్ప యాత్రా స్థలంగా వినతికెక్కిన విషయం చరిత్రకారులకు, పురావస్తు పరిశోధనాకారులకు, మరికొంతమంది ప్రజలకు కూడా తెలిసిన విషయమే. అలా నియండర్తల్ దశ నుండి యెస్గస్టర్స్ దశవరకు కొన్ని వేల కోట్ల అనంతరం మనిషి వానరాల నుండి నేటి స్థితికి వచ్చిన విషయం కూడా చరిత్ర పరిశోధకులకు తెలుసు. ఇలా ఆఫ్రికా ఖండము నుండి వలసలు ప్రారంభించిన మనిషి ఇపుడున్న అన్ని ఖండాలకు పరివ్యాప్తం చెంది, తమ మనుగడకోసం కొన్ని ఆచార వ్యవహారాలను, మత విధానాలను ఏర్పాటు చేసుకొని, ఒక ప్రత్యేక సంస్కృతిని సృష్టించుకుని ఆయా ప్రాంతాలలో, ఆయా వాతావరణ పరిస్థితుల కనుగుణంగా తన వస్త్రధారణంతో పాటు అనేక అంశాలను అవలంభిస్తూ వస్తున్నాడు.

మొదట మాతృస్వామిక వ్యవస్థలో వుండి మనిషి స్త్రీ ఆధీనంలో బ్రతుకుతూ వచ్చినవాడు, క్రమంగా ఆమె గర్భం దాల్చి ఇంటి పట్టుననే వుండి, పుట్టిన బిడ్డకు నడక మొదలుపెట్టిన తర్వాత స్త్రీ మళ్ళీ ఆధిపత్యం వహించే దశలోని ప్రకృతిపరమైన అంశాన్ని బలహీనతను ఆసరాగా చేసుకుని, పురుష ఆధిపత్యాన్ని నెలకొల్పుకుంటూ వస్తూ... నేడున్న పితృస్వామిక వ్యవస్థకు పురుషుడు కారకుడయ్యాడు.

ఈ క్రమంలోనే ఉద్భవించిన తత్వవేత్తలు రూసో, ప్లేటో, సోక్రటీస్, అరిస్టాటిల్, కారల్మార్క్స్ మొదలగువారు విదేశీయులైతే, మన దేశంలో మొట్టమొదటిసారిగా మనిషిని కేంద్రంగా చేసుకొని అతను ఏ విధానాలను అవలంభిస్తే సమాజంలో దుఃఖ రహితంగా, శాంతియుతంగా, హేతుబద్ధంగా జ్ఞాన వికాసంతో మనిషి బ్రతకగలుగుతాడో తెలియజేసిన మహానుభావుడు గౌతమ బుద్ధుడు. అంతకుముందు ఆర్య వలస మనువాదులైన వైదిక బ్రాహ్మణులు సృష్టించిన కర్మ, ధర్మ, పునర్జన్మ సిద్ధాంతాలతో నూటికి తొంభై శాతం మందిని దోచుకొని తాము బ్రతకడం కోసం యజ్ఞయాగాల పేరుతో, జంతు బలులు చేస్తూ తాగి తిని భోగలాలసులై వ్యవహరిస్తున్న వారిని ఆ విధానాలతోనే బ్రతకేటట్టుగా ప్రోత్సహించిన యజ్ఞవల్క్య, పరాశర, మను, చాణిక్యాదుల పిదప బుద్ధుడి దమ్మాన్ని ధ్వంసం చేయడం కోసం పూనుకున్నవాడు

ఆది శంకరాచార్యులు. ఇతడి దుర్మార్గపు చర్యల వలనే భారతదేశంలో పుట్టిన బౌద్ధం అంతం కావడం. అందుకు రుష్యశృంగుడిని ఆయుధంగా చేసుకొని బౌద్ధభిక్షువుల తలలను నరికించి, బౌద్ధ ఆరామాలను ధ్వంసం చేసి, బుద్ధుడి విగ్రహాలను విష్ణు అవతారంగా మార్చి, నేడు మన తిరుపతి కొండపైనున్న విగ్రహాన్ని వెంకటేశ్వరస్వామిగా కేరళ రాష్ట్ర రాజధాని త్రివేంద్రంలో గల అనంత పద్మనాభ స్వామిగా, మహారాష్ట్ర పండరీపురంలో పండరీనాధుడిగా మార్చివేస్తే, అనంతర కాలంలో వచ్చిన ముస్లింలు, ఆఫ్ఘనిస్తాన్‌లో గల అతిపెద్ద రాతి బుద్ధ విగ్రహాలను ధ్వంసం చేసినవారు ఆది శంకరాచార్యుల వారసత్వాన్ని పునికి పుచ్చుకున్నారు.

ఒకనాడు మన భారతదేశంలో పుట్టిన బౌద్ధం తూర్పు ఆసియా దేశాలైన చైనా, థాయిలాండ్, మలేషియా, బర్మ, శ్రీలంక దేశాలలో ఆయా దేశ అధికార మతంగా పరిఢవిల్లే స్థాయికి ఎదిగితే, మన దేశంలో తిరిగి హిందూమతం ప్రాబల్యంలోకి రావడానికి శంకరాచార్యుడే ప్రధానకారుడు. ఇందుకు ఈ మధ్యే అయోధ్యా రామమందిర నిర్మాణం కోసం జరిపిన త్రవ్వకాలలో అనేక బౌద్ధ సాంప్రదాయానికి సంబంధించిన వస్తువులు, పరికరాలు దొరికిన విషయం లోక విధితమే. అలాగే ఒకనాడు ప్రపంచానికే విద్యాభిక్షను పెట్టిన **తక్షశిల** విశ్వవిద్యాలయం ముస్లింల దాడులలో ధ్వంసమైపోతే మనువాదులు ధ్వంసం చేసిన అనేక కట్టడాలు, ఆరామాలు ఈ విధంగానే నాశనమయ్యాయి.

ఈ క్రమంలోనే డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ 1956 అక్టోబరు 14న ఐదు లక్షల మందితో తాను బౌద్ధదమ్మాన్ని స్వీకరించి తిరిగి బౌద్ధాన్ని పునర్జీవింపజేసిన తర్వాత ఇప్పుడది ఆసియా దేశాలతోపాటు యూరప్, అమెరికా, ఆస్ట్రేలియా వంటి దేశాలలో పరివ్యాప్తమవుతున్న విషయం మంచి పరిణామంగా బుద్ధిజీవులు కొనియాడుచున్నారు. ఐతే అంబేద్కర్ బుద్దిజాన్ని స్వీకరించిన తర్వాత వారి అనియాయులుగా చెప్పుకుంటున్న వారు బుద్దిజాన్ని, హైందవ మనువాదుల పద్ధతులను కూడా పాటిస్తూ "మేము బుద్ధిస్టులం" అంటున్నారు. ఇందుకు మనువాదులు ఆనందపడుచూ... కాగల కార్యాన్ని గంధర్వులే తీర్చారన్న రీతిలో భుజాలెగరేసు కుంటున్నారు. ఈ క్రమంలోనే బాబాసాహెబ్ 1956 లో ఇచ్చిన నవయాన బుద్ధిజంతో పాటు బుద్దుడి మహాయాన బుద్దాన్ని కలిపి **"డైనామిక్ బుద్దిజం"**గా ఆవిష్కరించి, బుద్దుడి త్రిసరణ, పంచశీల, అష్టాంగ, దశపారమితాలతో

పాటు అంబేద్కర్ ఇచ్చిన 22 ప్రతిజ్ఞలను కలిపి మూలవాసుల సిద్ధాంతాన్ని అప్లైచేసి, నూతనంగా "భీమ బౌద్ధ పీఠాన్ని" నెలకొల్పి, దాన్ని డిసెంబర్ 10, 2016న హైదరాబాద్ బాగ్‌లింగంపల్లిలో గల సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ఆనాటి తెలంగాణ రాష్ట్ర ఆర్థిక శాఖామాత్యులు గౌ॥ ఈటెల రాజేందర్ గారి చేతుల మీదుగా ఈ పీఠానికధిపతిగా గౌ॥ ప్రముఖ బుద్దిస్ట్ బోధీనాధుగారిని నియమించి ప్రారంభించడం జరిగింది. ఇప్పుడు ఇట్టి బౌద్ధ పీఠం తెలంగాణలో మెల్లమెల్లగా విస్తరిస్తూ ఆంధ్రప్రదేశ్‌లో గల తూ.గో. జిల్లాలో కాలుపెట్టి తన కార్యకలాపాలను కొనసాగిస్తూ వస్తుంది.

**5. ఏడు తరాల కథ :–** మన దేశంలో అనేక మత విశ్వాసాలు వున్నా మనువాదులు దశావతారాల పేర దేవుళ్ళను మన దేశంలోకి తీసుకొనివచ్చి, అందులో రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, బసవేశ్వరుడు కూడా దేవుళ్ళేనని చెబుతూనే.... ఒక్క రామకృష్ణులకు మాత్రమే అగ్రాసనమని, బుద్ధుడు బసవేశ్వరులని ఆఖరి వరుసలో పెట్టి, ముఖ్యంగా బుద్ధుడిని అంత్యవాసులకు మాత్రమే పరిమితమైన దేవుడిగా ప్రకటిస్తూ.... తమ కుహనావాదాన్ని ప్రదర్శిస్తూ వస్తున్నారు. ఈ క్రమంలో ఏ అవతారంలో లేని సత్యన్నారాయణ స్వామిని సృష్టించి, ఆ సత్యనారాయణ స్వామి వ్రతాన్ని ఏ వ్యక్తి అయితే ఏడాది కొకసారి జరుపుతాడో ఆ ఇంట్లో అన్ని శుభాలు కలుగుతాయని భ్రమింపజేసి, అందులో కల్పించిన కథలు విన్నవారు "అయ్యో! – మేము ఈ సత్యన్నారాయణ కథలో చెప్పిన కథలను పాటించకపోతే అరిష్టాలు కలుగుతాయనే అభద్రతా భావాన్ని ఆయా వ్యక్తులు కల్పించారు. తద్వారా ఆ కథలు చెప్పే పూజారులు పంతుళ్ళు, కథకులు ఈ కథానంతరము వారు కల్పించిన భ్రమలకు భయపడిన భక్తులు సంభావన రూపంలో ఇచ్చే ధన, కనక, ధాన్య వస్తువులు దాదాపుగా మూడు నాలుగు నెలల ఇంటి అవసరాలను తీర్చేంతగా వుంటాయంటే మీరు నమ్మకపోవచ్చు. ఇందుకు తూ.గో.జిల్లా అమలాపురం తాలూకా, సామంతపురం గ్రామంలో ఒక ఆర్.యమ్.పి. డాక్టర్ జరిపించిన సత్యనారాయణ వ్రతాన్ని ప్రత్యక్షంగా తిలకించగా ఆ చదివింపులు, ధన, కనక, ధాన్య వస్తు రూపాల్లో చూసి, ఆనాటి నుండే దీనికి ప్రత్యామ్నాయ కథారూపాన్ని నెలకొల్పాలని సంకల్పించి ఏ పంతులూ, పూజారీ లేని ప్రబోధకులు లేని ఎవరింటి కథను వారింటి కుటుంబ పెద్దే, తమ కుటుంబ సభ్యులకు నేనెవరు? ఎక్కడ పుట్టి పెరిగాను? నా తాత ముత్తాతలు ఏం చేసేవారు భవిష్యత్తులో మీరేంచేస్తే సమాజ వికాసానికి ఎలా

సహకరించిన వారవుతారో చెప్పే విధానాన్ని **"ఏడు తరాల కథ"** పేరుతో 1996 బుద్ధ పూర్ణిమనాడు మా ఇంట్లో మొట్టమొదటిసారి ఈ కథా గానం చేసి, మా గంగాధరి వంశంలో మా గురించి, తండ్రి గురించి, వారి తండ్రి గురించి, మరియు వారి తండ్రి గురించి నాలుగు తరాలకు సంబంధించిన అంశాలను చెప్పి గంగాధరి వంశం ఎప్పుడు ఎలా మొదలై వచ్చిందో తెలియపరచడం జరిగింది. ఇందుకు మరొక ప్రేరణ కూడా ఏమిటంటే, మనువాద కులాలవారు దసరాకు ముందు వచ్చే అమావాస్యను పురస్కరించుకొని "పితృ అమావాస్య" పేరుతో తర్పణాలు, క్రతువులు చేసే విధానాన్ని ఉత్పత్తి కులాలైన యస్.సి. యస్.టి., బిసి.లు" పెత్తరమాస" అంటూ పిలిచే కార్యక్రమాలుగా జరుపుతారు. ఈ క్రమంలోనే తమ కుల పూజారిని పిలిచి ఆరోజు దివంగతులైన తమ పెద్దలకు బియ్యం, పప్పు, బెల్లం, ఖర్జూర, ఆకుకూరలు ఇచ్చే సాంప్రదాయం వుంది. ఈ క్రమంలో మా ఇంటికి వచ్చే జంగములైన అందరూ శుభ్రంగా స్నానం చేసి ఒక్క పొద్దుతో వున్న కుటుంబ సభ్యులకు తను తెచ్చిన విభూదిని మూడు వేళ్ళకు రాసుకొని, ఆయా కుటుంబ సభ్యుల నుదుటిపైన అడ్డంగా రాసి మధ్యలో ఎర్ర కుంకుమ బొట్టుపెట్టి, ఇంటి యజమాని తాతా ముత్తాతల వివరాలు అడిగి వారిని కీర్తించి, చివరిగా వారిచ్చే వస్తు సముదాయాన్ని స్వీకరించి ఆయా వ్యక్తులు వారిచ్చే స్థాయి కట్నాల్ని తీసుకొని పెద్దగా గంటవాయిస్తూ ఈ దేశ మూలవాసులు తాము ఈ దేశానికి అసలైన వారసులమని చెప్పడానికి పనికివచ్చే అంశం.

(వ్యాస రచనకు సహకరించిన కొమురాజు మల్లిఖార్జున్ గారికి ధన్యవాదాలు)

* * *

# 9. కళ....

- వేనేపల్లి పాండురంగారావు, మట్టిముద్రణలు, ఆలగడప, నల్గొండ జిల్లా

కళ కళ కోసం కాదు. కళ ప్రజల కోసమూ కాదు. కళ పనుల కోసం. కళలు కుసొని పుట్టించినవి కావు. పనులు చేస్తూ పనుల్లో మెరుగుకోసం నైపుణ్యం కోసం తోడుతెచ్చుకున్నవి.... దుక్కిదున్నేటప్పుడు దప్పుకొట్టెటప్పుడు చెప్పుకుట్టేటప్పుడు, వడ్లు దంచేటప్పుడు, ఇళ్లు అలికెటప్పుడు బువ్వ వుడికెటప్పుడు... తమతో తాము తమలో తాము మాట్లాడుకున్నవే పాటలైనవి... పదాలైనవి... ధాన్యం కొలుస్తూ... ఒకటి రెండు లెక్కిస్తూ ఆరునొక్కటీ కాడికొచ్చి రాగమైంది. నీళ్ల కడువ నడుమున బెట్టుకుని నడుస్తూ ఊగుతూ ఆగుతూ వయ్యారాలూ పోతూ పోతూ నాట్యమైంది, నృత్యమైంది.

ఇల్లలుకుతూ ముగ్గులేస్తూ కూర కలుపుతూ అమ్మ అనుకోలేదు తాను కళలను సృష్టిస్తున్నానని... కర్ర చెక్కుతూ, బొమ్మచెక్కినా బొమ్మగీసిన

ఆకు నమిలారు నోరు పండింది, కాసు సున్నం కలిపారు కమ్మటి కళ అయింది. కిళ్లీ అయింది. ఆకు నులిమారు చేయిపండింది గోరింటాకయింది.

పనులు చేస్తూ చేస్తూ అలిసిపోయారు ఇసుక తిన్నెల్లో పండి దొర్లారు పిచ్చుక గూళ్ళు కట్టుకున్నారు అవే మిద్దెలు మేడలు భవనాలు భవంతులు అయినవి.

అలసి సొలిసి ఒకటయ్యారు గిచ్చుకున్నారు, వళ్లంతా తడుముకున్నారు... అదే శృంగార కళ అయింది.

పొద్దూకులు వందల జీవాలను, మందలుగా కలిపి కాసినా మేపినా పొద్దూ కాగానే ఎవరిండ్లకు వాళ్లు పోయేటప్పుడు ఎవరి జీవాలను (ఒక్క తీరుగనే వుండే గోర్లు మేకలు) వాళ్లు వేరుచేసి తోలుకుపోతారు, ఒకటి అర తప్పినా తెల్లారాక మళ్లీ సరిచేసుకుంటారు.

ఊరెడు మంది మాసిన బట్టలు చాకిరెవులో మైలదీసి మళ్లీ ఎవరింట్లో వాళ్లవి వాళ్లకే ఇస్తారు, ఒక్క తీరుగా వుండే (రంగుబట్ట) పంచె చిర గుడ్డ బట్టలు.

నాగలితో సాలుబడితే రైలు పట్టాలే గుర్తుకు రావాలి.

వందలమంది కూలీలతో రోజుల తరబడి పని చేయించుకున్నా నాకాలు (సెలవులు) గాని పని దినాలు గాని పైసలు గాని తేడారాదు... ఇవన్నీ పనులే అనుకుంటే కళలె...

ఎవరో లెక్కబెట్టినట్లు 64 కళలు, "బొమ్మ" దీసినట్లు 24 కళలు కావు. పనిలో ప్రాణం పెట్టి చేస్తే ప్రతి పని ఒక అద్భుతమైన కళ.

ఇల్లు ఊకి సాంపిజల్లి అలికి ముగ్గులేసినా, అరకగట్టి మేడిపట్టి కొంగ్రవేసి సాలు బెట్టినా, వాళ్ళు పనిలో భాగమే తప్ప ఏవో కళ లని ఎవరినో ఉద్ధరించాలని చేసినవి కావు,

కడుపునిండా తిని నోటినిండా తమలపాకులేసుకుని తీరికగా తాటాకు మీద రాసిన బాపన రాతలు కావు, అసలు ఏవి వాళ్లవి కావు, వాళ్లు సొంతం జేసుకుని మైల బూసి అంతం జేసారు.

శ్రమైక జీవన సౌందర్యంతో శ్రామిక వర్గం ఒళ్లు వంచి పనిచేస్తూంటే ముగ్దులై మురిసిపోయి వాటిని వడిసిపట్టి పటం గట్టి వాటికి పట్టం గట్టారు బుద్ధి జీవులు. కాబట్టి కళలు ప్రజలవే.

* * *

# 10. జనజీవన స్రవంతులు జానపద కళలు

- అరుణోదయ అంజయ్య, అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, ఒంగోలు

కళకళ కోసం కాదు. ప్రజల కోసం. కళలు ప్రజల్ని మేల్కొల్పుతాయి. చైతన్యవంతం చేస్తాయి. జనజీవన వికాసానికి దోహదపడతాయి. క్రీ.పూ. 3వ సహస్రాబ్ది నుండి ఆధునిక కాలం వరకూ భారత ఉపఖండంలో నిర్మితమయినది భారతీయ కళ. భారతీయ సంస్కృతిలో విలాసవంతమయి, భావం, స్వేచ్ఛా యుతమయిన భావ వ్యక్తీకరణ భారతీయ కళలో కనబడుతుంది. సాంస్కృతిక చరిత్ర, మతాలు మరియు వేదాంతాలలో భారతదేశం యొక్క కళ విశాల దృక్పథంగా పెనవేసుకుని ఉంది. జీవితం మరియు కళాత్మకత వేరుచేయలేని విధంగా భారతీయ కళలో ఉంటాయి. గిరిజన కళారూపాలు మూఢనమ్మకాలు తీవ్రంగా ఉండి మనసు మాత్రం మృదువుగా ఉంటాయి. మరి, వారి కళలు వారి జీవితాన్ని తెలియజేయు మర్మాన్ని కలిగి ఉంటాయి. గ్రామీణులు, గిరిజనులు, దిమ్మరుల యొక్క కళలు జానపద భావవ్యక్తీకరణ యొక్క ఆకృతిని ఏర్పరుస్తాయి. కళ యొక్క అభివృద్ధిలో, దేశానికి చెందిన సంస్కృతుల మొత్తం ప్రజ్ఞలో జానపదుల ఉత్సాహం గణనీయమయిన పాత్ర పోషిస్తుంది. భారత జాతీయవాదం, ఆసియా ప్రజల ఐకమత్యంతో సరిపోయే నూతన కళా సంబంధ పాఠశాలను ప్రవేశపెట్టడానికి కృషి చేసిన ఆధునిక భారతీయ కళాపితామహుడుగా అవనీంద ఠాగూర్‌ని చెప్పవచ్చు. 1947 స్వాతంత్ర్యానంతరం భారతదేశ వ్యక్తీకరణ నూతన కళాత్మక విధానాలు స్థాపించడానికి Progressive Artists Group స్థాపించబడింది. ఇది భారత జాతీయ కళ నుడికారాన్ని మార్చడంలో ఎంతో సహాయపడింది. ఈ Progressive Artists Group భారతీయ సంగీతం, జానపద జనరంజక, పాశ్చాత్య మరియు శాస్త్రీయవంటి బహుళ వైవిధ్యాన్ని కలిగి ఉంటుంది. తెలుగువారి అపురూపమైన జానపద కళ మన తెలుగువారి వారసత్వమే. జానపద కళ సాహిత్యం ద్వారా జాతి సంస్కృతి తెలుస్తుంది. ఒక జాతి నిర్మాణానికి అవసరమయిన ఆకారాలు జానపద కళలు అందిస్తాయి. మన సంస్కృతి వారసత్వాల్ని కాపాడుకోవటంలో ఈ జానపద కళలెంతో ఉపయోగ పడతాయి. తెలుగు భూమిలో పండిన పంట పొలం వంటిది మన జానపద కళ. ఈ కళలు తెలుగు నేలను సుసంపన్నం చేసాయి, దశాబ్దాలుగా ప్రజలకు వినోదాన్ని – విజ్ఞానాన్ని అందించినవి మన తెలుగు కళలే. జానపదులు వారి జీవితాన్నే వస్తువుగా చేసుకుని ఆడిన నాటకాలు జానపద కళలు. పురాణాలన్నింటినీ దృశ్యమాధ్యమంలో పురాణ పరిజ్ఞానాన్ని అందించినవి ఈ కళలే. ఆంధ్రప్రదేశ్‌లో నేటికీ కొన్ని సజీవ కళారూపాలు మనకి కనిపిస్తూనే ఉన్నాయి. పరివర్తిత నాటకానికి,

ఆధునిక నాటకానికీ జానపద నాటకాలే మూలాలు. భరతుని నాట్యశాస్త్రంలోని రూపక ప్రక్రియలు జానపద కళలని అర్థం చేసుకోవాలి. గాధాశప్తసతి, ప్రాకృతిక భాషలో జానపద కళలు ఉన్నాయని విద్వాంసులు ఆధారాలు చూపారు. జానపద జీవితాన్ని విస్తారంగా వర్ణించిన తోలుబొమ్మలాట, చెక్కబొమ్మలాట, యక్షగానం, వెడమాట, కోడంగి ఆట, వెద్దంగము కాలగతిలో కలిసిపోయాయి. కోలాటం, పేరణి నేటికీ సజీవంగా విరాజిల్లుతున్నాయి. గత వంద సం॥రాల లోపు చాలా జానపద కళలు అంతరించిపోయాయి. కనీసం రాబోయే 25 సం॥రాల నుండి 50 సం॥రాలలో ఎన్నో జానపద కళలు అంతరించిపోతున్నాయంటే ఎంతో బాధాకరంగా ఉంది. మరి, ఈ జానపద కళలు ఏంటో కొన్ని తెలుసుకుందాం. వీటిని అంతరించి పోకుండా మనం ఏం చేయాలో కూడా గమనించాలి. ముఖ్యంగా ఆ కళల్ని చూద్దాం. వృత్తి జానపద కళలు; ఒగ్గు కథ, పంబ కథ, ఆశాది కథ అంతేకాక బైండ్లకత, కొమ్ముల కత, పాండవ కత, రుంజుకత అన్నీ కూడా వృత్తి ఆధారిత కళలే. అంటే చేసే వృత్తిలో నుండి ఈ కళలు పుట్టాయి, ఈ కళలే వారి జీవితాలకి ఆధారమయ్యాయంటే అతిశయోక్తి కాదు. మరి, ప్రజలకు, సామాన్య జనానికి వినోదాన్ని అందించినటువంటి ప్రజాకళలు; కోలాటం, చెక్కభజన, పండరి భజన, సెల్ భజన ఇవన్నీ కూడా వినోదానికి సంబంధించినటువంటి కళలే. అంతేకాదు, మనం చూసే సంక్రాంతి హరిదాసు, పిట్టలదొరవంటివి రుంజు కథలో భాగంగా గమనించాలి. గొల్లసుద్దులు, ఒగ్గుకత, పిచ్చుక కుంటికత, పాండవుల కత వంటివి జానపద కళారూపాలే. తెలుగువారి అపురూప జానపద కళారూపాలు కొన్ని మనం గమనిస్తే సంగీతంలో, కర్ణాటక సంగీతం మన జానపద కళారూపమే. త్యాగరాజు, అన్నమయ్య పాడిన రాసిన కీర్తనలు తెలుగువారి జానపద కళారూపాలే. కూచిపూడి వంటి నాట్యాలు తెలుగు జానపద కళారూపాలే. చెంచు భాగవతం, భామాకలాపం, బుర్రకత, తోలుబొమ్మ ఇవన్నీ చెంచు భాగవతంలోని మన జానపద కళారూపాలే. వీరనాట్యం, బొట్టబొమ్మలు, డప్పుల సవ్వళ్ళు, తప్పిట గుళ్ళు, లంబాడీ బోనాలు, ఇవన్నీ మన వీరనాట్య జానపద కళారూపాలే. ధింసా కోలాటం, జోతిర్నృత్యం వంటివి మన జానపద కళారూపాలే. కత్తిసాము, కర్రసాము, పల్లెసుద్దులు, పులివేషాలు, కలంకారి, శిల్పకళ ఇవన్నీ కూడా మన జానపద అపురూప కళాఖండాలే. మన సంస్కృతీ సంప్రదాయాల్ని కాపాడేటువంటి మన జానపద కళలను కాపాడవలసిన బాధ్యత మీ అందరిపైనా, మన అందరిపైనా ఉన్నది. కావున తప్పనిసరిగా ప్రతి ఒక్కరూ కళలని ఆదరించండి, కళలను కాపాడండి. మన సంస్కృతిని కాపాడండి.

***ప్రజాకళలు వర్ధిల్లాలి.***

# ముగింపు

> “The writer who is committed, who has a personal vocation for commitment, belong to society and not to the state.... The writer who is committed sincerely and by vocation and who wishes to be true to himself must remain in the service of man or of his fellowmen.”

– Ignazio Silone
Writers and Commitment

“నృత్యగాన వాయిద్యాలు మానవులందర్నీ సమానం చేసే మహత్తర సాధనా”లంటాడు రాహుల్ సాంకృత్యాయన్ తన ‘ఘుమక్కడ్ శాస్త్రం’లో. ఉత్తర భారతంలో అంతరించిపోయిన ‘పరీ’ నృత్యం గురించి పేర్కొంటూ ప్రజాకళల్ని అభ్యసించేవారే కనబడటంలేదని వాపోతాడు. అంతరించిపోతున్న నాటక సమాజాలని గురించి “నాచ్ బికారి నాచ్”, “బల్లవ స్పీక్స్” “చిత్రాకార్” వంటి మంచి డాక్యుమెంటరీలు, సినిమాలు కూడా వచ్చాయి. తెలుగులో ఈ రకమయిన చర్చ అంతగా లేదు.

వ్యక్తిగతంగా ఏ కళలోనూ చెప్పుకోదగిన ప్రవేశం నాకు లేదు. సంగీతం నేర్చుకోడానికో పదిరోజులు వెళ్ళిన జ్ఞాపకం ఉంది. ఐతే కళల్ని అనుభూతి చెంది ఆనందించడం కూడా ఒక కళేననే భావన నాది. 1948లో కాకినాడలోని వొక గదిలో కొందరు యువత కల్సి పెట్టిన “కళాకేళి నికేతన్” సోమసుందర్ ప్రకాశకుడిగా చివరిదాకా నడిపారు. పెద్దాపురంలో ప్రయోక్త సుబ్బారావు గారు “కళాకేళి హిస్ట్రియానిక్స్” అనే సంస్థ నెలకొల్పి ప్రయోగాత్మక నాటకాలు ప్రదర్శించినట్లు సో.సు. తన స్వీయచరిత్ర రెండవభాగం “పూలు-ముళ్ళు”లో రాసారు. మా చినతాతయ్య ఎం.వి. సూర్యనారాయణ (చిత్రకారులు) ‘కళానికేతన్’ పేరిట మద్రాసులో ఒక సంస్థ నెలకొల్పారు.

ఐతే, జీవితంలో కళల ప్రాధాన్యత గురించిన చర్చలు ఎంత విస్తృతంగా జరిగితే అంత మంచిది. నిజానికి ‘సంస్కృతి’ గూర్చి అధ్యయనం చేసేనాటికే ‘కళ’ కోసం ఒక ప్రత్యేకమయిన వర్క్ తీసుకొని వచ్చే ఆలోచన నాకుంది. అది ఇన్నాళ్ళకిలా

కార్యరూపం దాల్చింది. “కళ కాసుల కోసం కాదు, ప్రజల కోసం” అంటో ‘ప్రత్యామ్నాయ సినిమాలు – ప్రజాస్వామ్య విలువలు’ పేరిట రామచంద్రపురంలో చేసిన ‘ప్రోగ్రెసివ్ ఫిలిం ఫెస్టివల్’ (A Film Festival of the people, for the people, by the people) తెలుగు రాష్ట్రాల్లో ఒక వినూత్న ప్రయోగం.

అదక్కడితో ఆగలేదు. కోవిడ్ లాక్డౌన్ కాలంలో కూడా సోషల్ మీడియా కేంద్రంగా “బుజ్జాయిల కోసం బుల్లి సినిమాలు” “కులాంతర సమాజం కోసం సమాంతర సినిమాలు” “పురుషాధిక్యతకి వ్యతిరేకంగా లింగ సమానతా సినిమాలు”, “మతాతీత మానవత కోసం మంచి సినిమాలు” పేరిట సిరీస్ పరిచయం చేయడం జరిగింది. వైవిధ్యమయిన వైధానిక భిన్నత్వం పట్ల సహజంగా అమలయ్యే అనుమానం, అంటరానితనం అనేవి అజ్ఞానంలో నుంచి పుట్టుకొచ్చినవే కాన ఆ విషయం వొదిలిపెడదాం.

"True modernism is fearlessness of consciousness" అంటాడు జె.ఎన్.యు. ప్రజాకవి రమాశంకర్ యాదవ్ @ విద్రోహి. నిర్భయత్వంతో కూడిన చైతన్యమే నిజమయిన నాగరికత, అభయమిచ్చే అంతర్చేతనే అసలైన ఆధునికత. అటువంటి ఉన్నతమైన అంతరాత్మ నిర్మాణానికి ఉపకరించేది కళ. యుగయుగాలుగా మానవాళి తన స్వీయసాధనలో భాగంగా, ప్రస్థానంలోని అనేక దశల్లో అంతర్వాహినిగా సృజనశీలమయిన కళాతాత్వికతను సృష్టించుకుంది.

షెల్లీ మొదలుకుని క్రిస్టోఫర్ కాడ్వెల్‌దాకా చిన్న వయసులోనే మృత్యువు బారిన పడినప్పటికీ, ఎప్పటికీ మానవాళి కోసం నిలిచే చింతనాత్మక సారస్వతం పట్ల వాళ్ళు ప్రకటించిన నిష్కళంక నిబద్ధత గల అభివ్యక్తే, అంతిమంగా మానవాళి అంతర్ముఖమయ్యి తనని తాను ఎప్పటికప్పుడు కొత్త జీవంతో పునర్నిర్మించుకుందుకు పనికొచ్చే మానవీయ ప్రసక్తి. అదే జీవితానికి ఒక ఆర్తిని చేకూర్చే భుజకీర్తులన్నింటినీ అధిగమించే సార్వజనీన కళకి స్ఫూర్తి.

అలా కళలకి సముచిత స్థానం కల్పించడం కోసం తెలుగులో అనేక ప్రయత్నాలు జరిగాయి, జరుగుతున్నాయి. ఐతే, రానురాను ప్రజాకళలపట్ల అధ్యయనం కొరవడుతోంది. కళాతత్వశాస్త్రాలపట్ల అభిరుచిని అరిస్టాటిల్ కాలం

నాటి నుండి ఈనాటి వరకూ అదేదో వేరుగా ఉండే పెద్దమనుషుల వ్యవహారంగా తప్పితే ప్రజాతంత్ర దృక్పథంతో చూస్తున్న వాళ్ళు తక్కువ.

ఈ క్రమంలో బాల్యం నుండి కళని కళాత్మకంగా పరిచయం చేయడం అవసరం. పరాయికరణ బారినపడ్డ యాంత్రిక మానవుడికి, ఆర్ద్రతతో కూడిన హృదయ స్పందనలు కలిగించి వసుధైక జీవిగా మలచగలిగేది కళ. కళ శక్తివంతమైన సాధనం కనుకనే కళాకారులపై నిర్బంధం సాగుతోంది. ఇథియోపియా ప్రజా గాయకుడు 34 ఏళ్ళ హచాలు హండీసా నుండి టర్కిష్ జానపదాల కోసం 289 రోజులు నిరాహార దీక్ష చేసి అమరురాలైన హెలెన్ బోలెక్ వరకూ ఎన్ని ఉదంతాలనైనా చెప్పొచ్చు. వారిపై దాడులు జరుగుతాయి. నిషేధాలు మీద పడతాయి.

కళ ప్రయోజనం లేనిదనే శుద్ధ యాంత్రిక హేతువాదంతో నేను అంగీకరించలేను. అలాగని కళని ఆకాశానికెత్తే అవకాశవాదంతో ఏకీభవించనూ లేను. కళకి సంబంధించిన ప్రత్యామ్నాయ దృక్కోణం గల ఆలోచనలు మనకి అంతగా లేవు. ఆ దిశగా కృషి జరగాల్సిన అవసరం ఉన్నది.

అమెరికన్ 'బ్లాక్స్ గెరిల్లా ఆర్ట్' మొదలుకొని ఆగస్తో బోలో 'థియేటర్ ఆఫ్ ది అప్రెస్డ్' వరకూ ప్రపంచంలో జరుగుతున్న విభిన్న యత్నాల తాలూకు ఛాయలు కూడా మన దేశంలో ఇతరేతర రాష్ట్రాలకి తెల్సినంతగా మనకి తెలీదు. కరోనా కారణంగా గడిచిన ప్రజాపోరాటాల్ని నెమరేసుకుని "కరోనాకి ముందు, కరోనా తర్వాత – కళ" అనే అధ్యయనం కూడా జరిగితే బాగుంటుందనేది నా అభిప్రాయం.

చివరగా అభిప్రాయబేధాలు ఉన్నప్పటికీ సాటి మనుషులతో శత్రుత్వం నా అభిమతం కాదు. అనుకోని పరిస్థితుల్లో అలాంటివి తలెత్తినా మైత్రే నా అంతరాత్మ ఆర్తి. ఆర్థికంగా నిలకడలేని స్థితిగతుల్లో సైతం నన్నిలా ముందుకు నడిపించేది జ్ఞానం కోసం, సత్యం కోసం, సమానత్వం కోసం నిత్యం వెంటాడే ఆ దాహార్తే, సెలవు.

* * *